భయంకరంగా ఉంటాయని ఉద్ఘోషించారు.

"భారతదేశం సంపన్నమే అయినా, భారతీయులు పేదవారుగా ఉండుటకు మనమనుసరిస్తున్న నేటి విధానాలే పరమహేతువు"లని వారు ఈ ఉపన్యాసాలద్వారా మనలను ఉద్బోధించారు.

ఈ ఉపన్యాసాలు మాచే పూర్వం హిందీ భాషలో ప్రచురించబడినవి. ఇపుడు వాటి అనువాదాన్ని తెలుగులో గూడ ప్రచురించి మీ ముందు ఉంచుతున్నాము. స్వామీజీ అనుమతితోనే మరో చిన్న పుస్తకం "గర్భపాతం ఉచితమా? అనుచితమా, తీర్పుమీదే" గూడా తెలుగులో మా ద్వారా ప్రచురింపబడింది. ఈ పుస్తకంలోని వ్యాసాన్నిగూడ శ్రద్ధతో చదివి వాస్తవాన్ని గ్రహించండి.

ఇట్లు
ప్రకాశకులు.

॥ శ్రీహరిః ॥

## విషయసూచిక



~~~~oOo~~~~
~~~~

నెహ్రూ బాల పుస్తకాలయం - 10

# విదేశీయుల భారత దర్శనం

రచన

కె. సి. ఖన్నా

బొమ్మలు

కృష్ణ ఖన్నా

నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

న్యూ ఢిల్లీ

మతమౌఢ్యంగా (మతతత్త్వంగా), మతద్వేషిని మతాతీత వ్యక్తిగా (సెక్యులరిస్టుగా) చెబుతున్నారు. ఈ బుద్ధి ఎటువైపు పోతున్నది? "వినాశకాలే విపరీత బుద్ధిః". "భగవద్గీత" దీన్నే "తామసబుద్ధి"గా పేర్కొంది.

అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా ।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ ॥
(భగవద్గీత. 18/32)

"ఓ అర్జునా! తమోగుణముతో నిండిన ఏ బుద్ధి అధర్మాన్ని ధర్మంగాను, ప్రతివిషయాన్నీ విరుద్ధంగానూ విపరీతంగానూ భావిస్తుందో అది తామసబుద్ధి"

మందోదరి రావణాసురునితో ఇలా అన్నది :-

**కాల దండ గహి కాహు న మారా । హరఇ ధర్మ బల బుద్ధి విచారా ॥**
**నికట కాల జెహి ఆవత సాఈం ॥ తేహి భ్రమ హోఇ తుమ్హారిహి నాఈం ॥**
(మానస, లంకా. 37:4)

మృత్యువు ఎవ్వరినీ కర్రతో కొట్టదు. వాని ధర్మమును, బలమును, బుద్ధిని, ఆలోచనాశక్తిని హరించును. ఓ స్వామీ! ఎవ్వనికి మృత్యువు సమీపించునో వానికి మీవలె భ్రమ కలుగును.

## దైవము, ప్రకృతి విధానముల తిరస్కారము.

భగవంతుడు, ప్రకృతి ఈ రెండింటి విధానానుసారం సృష్ట్యాది నుంచే జీవుల జననమరణాలు జరుగుతూ వస్తున్నాయి. జననమరణాల కార్యం మానవుల చేతుల్లో లేదు. అది దైవం చేతుల్లో, ప్రకృతి చేతుల్లో ఉంది. ఏ జీవినైనా చంపటమనేది మనుష్యుల అధికారం ఎలాకాదో, అది ఎంతటి పాపమో, అలాగే ఏ జీవినైనా పుట్టకుండా నిరోధించటమనేది కూడా మనుష్యుల అధికారం కాదు; అది మహాపాపం కూడా! దీని అర్థమేమిటంటే, జనాభా నియంత్రణం అనాదికాలంనుంచీ స్వతస్సిద్ధంగానే

దైవం, ప్రకృతి విధానానుసారం జరుగుతూ వస్తోంది. కుక్కలు, పిల్లులు, పందులు మొదలైన వాటికి అధికసంతతి (వాటి సంతానం) ఉండును. పైగా అవి కుటుంబ నియంత్రణను కూడా పాటించవు. అయినా కూడా ఈ భూమండలమంతా వాటితో నిండిపోతున్నట్లు కనిపించటం లేదు. ఎందుచేతనంటే వాటి నియంత్రణ దైవం ప్రకృతుల శాసనానుసారం జరుగుటయే. వాటి శాసనాధికారంలో వేలు పెట్టి జోక్యం చేసుకోవడం పాపం, అన్యాయంకూడా. హిందువులు, హిందూమతంలో అంతర్భాగమైన జైనులు, సిక్కులు, ఆర్యసమాజీయులు, మహమ్మదీయులు, క్రైస్తవులు, యూదులు, పారిసీకులు మొదలైనవారు ఇంకా ఎందరో సంతాననిరోధక కృత్రిమపద్ధతులను అవలంబిస్తూ, ధర్మవిరుద్ధమైన, నీతివిరుద్ధమైన, దైవ విరుద్ధమైన, ప్రకృతి విరుద్ధమైన పనులు చేస్తున్నారు. దీనికి ఫలితంగా వారు ఈలోకంలో, పరలోకంలో కూడా భయంకరమైన శిక్ష అనుభవించాల్సి వస్తుంది.

దయాళువు, పరహితైక పరాయణుడు అయిన ఒక సాధువుండేవాడు. ఆయనకు ఒకసారి భగవంతుడు ప్రత్యక్షమై వరం కోరుకోమని అడిగాడు. అప్పుడు ఆ సాధువు "నేను వెళ్ళినచోటల్లా అక్కడి ప్రజలు, అయ్యా! మీరు వర్షాలు కురిసేలా అనుగ్రహించండి!" అని అంటున్నారు. కాబట్టి నేను ఎక్కడ కోరితే అక్కడ వానలు కురిసేలా వరం ఇవ్వండి!" అని అడిగాడు. భగవంతుడు వరం ఇచ్చేశాడు. అప్పుడు సాధువు ప్రతిచోటా వానలు కురిపించటం ప్రారంభించాడు. అధికవర్షాలు కురియడంతో విషజంతువులు అధికముగా పుట్టుకొచ్చాయి. దరిమిలా పంటపొలాలకు నష్టం వాటిల్లసాగింది. అలాగే విషపూరితమైన మొక్కలు కూడా పుట్టుకొచ్చాయి. పశువులు వ్యాధిగ్రస్తమయ్యాయి. జ్వరము వ్యాపించటంతో ప్రజలు వ్యాధిగ్రస్తులై మరణించసాగారు. సాధువు భగవంతుణ్ణి స్మరించుకొన్నాడు. అప్పుడు భగవంతుడు "వర్షాలు పడ్డ తర్వాత కొద్దిరోజులు సూర్యరశ్మివల్ల జలవాయువులు శుభ్రపడతాయి. కానీ ఎడతెరిపి లేని వర్షాలవల్ల విషం వ్యాప్తి చెందుతుంది. అందుకే నువ్వు కోరినవర్షాలవల్లనే ఈ స్థితి యేర్పడింది" అని చెప్పగానే సాధువు భగవంతునితో, "ఇప్పుడు ఈ వ్యవస్థను తమరే చక్కదిద్దండి, ఎందుకంటే

ఎప్పుడు ఎక్కడ ఏపని అవసరమో దాన్ని మీరే పూర్తిగా ఎరుగుదురు" అని అన్నాడు.

"మేరి చాహీ మత కరో, మై మూరఖ అగ్యాన ।
తేరీ చాహీమే ప్రభో, హై మేరా కల్యాన ॥"

"స్వామీ! నేను మూర్ఖుణ్ణి, అజ్ఞానిని నేను కోరిన కోర్కెలు తీర్చకుము. నీ సంకల్పంలోనే నా సంక్షేమమంతా ఉన్నది. (సిద్ధిస్తుంది.)"

భావం ఏమిటంటే దైవం, ప్రకృతి ఈ రెండింటి విధి విధానానుసారం జరిగేవన్నీ సరిగానే జరుగుతాయి. ఎందుకంటే మానవులది అల్పదృష్టి అయితే భగవంతునిది దీర్ఘదృష్టి. పరహితార్థదృష్టితో అయినప్పటికి పరమాత్మ, ప్రకృతి చేసే పనులు తమ చేతుల్లోకి తీసుకోవడంవల్లనే ఇంత నష్టం వాటిల్లినప్పుడు పరహితమైన ఆలోచన లేకుండా కేవలం స్వార్థబుద్ధితో ప్రకృతి, పరమాత్మలు చేసేపనులు తమ చేతుల్లోకి తీసుకొనేవాళ్లవల్ల ఎంత నష్టం సంభవిస్తుందో వేరే చెప్పాలా?

దైవదత్తము, ప్రకృతిదత్తమైన ఉత్పాదకశక్తిని నాశనం చేయడం మహావినాశకారకమైన విషయం. సమస్త యోనులలో సర్వోత్కృష్టమైన మానవయోనియొక్క ఉత్పాదకశక్తినే నిషేధిస్తే అభివృద్ధి ఎలా జరుగుతుంది? దాని ఫలితము పతనమే. మానవులలోకెల్ల హిందూజాతి ఉత్తమోత్తమమైనది. ఇందులో గొప్ప విలక్షణులు, మహామునీశ్వరులు, సత్పురుషులు, మహాత్ములు, దార్శనికులగు విజ్ఞానవేత్తలు, మేధావులు, జన్మించినారు. ఇలాంటి జాతికి చెందిన మనుషుల్ని పుట్టనివ్వకపోతే మరి అలాంటి శ్రేష్ఠులు, విలక్షణులు ఎలా ఎక్కడ జన్మించారు?

ఆలోచించండి! ఒకవైపు మనం దేశాభివృద్ధికి ఉత్పాదన పెంచాలనుకొంటున్నాం. మరోవైపు ఉత్పాదక శక్తిమీదే నిరోధాన్ని ప్రకటిస్తున్నాం. ఉత్పాదకశక్తి లేనప్పుడు ఉత్పాదన ఎలా ఉంటుంది? భోజనశాలకు ఎక్కువమంది భోజనం చేసేవాళ్లు వస్తుంటే మనం చెయ్యాల్సింది ఎక్కువ వంట వండటం గాని, వచ్చే వాళ్లను రానివ్వకుండా

వుండటం కాదు గదా! అలాగే జనాభా పెరుగుతుంటే, తెలివితేటలు ఉత్పత్తి పెంచటంలో చూపించాలిగాని, మనుషులు పుట్టకుండా నిరోధించటంలో కాదు. ఇప్పటికే పొలాల్లో, పనిచేసేవాళ్ళ సంఖ్య తగ్గిపోయింది. ఒకరు లేక ఇద్దరే సంతానమైతే ఇంటిపనే పూర్తికాదు సరికదా! మరి పొలంపనులు ఎవరు చేస్తారు? వృద్ధులైన తల్లిదండ్రుల సేవ ఎవరు చేస్తారు? సమాజానికి కావలసిన సేవలు ఎవరు అందిస్తారు? సైన్యంలో ఎవరు చేరుతారు? కళారంగాల్లో ఎవరు శిక్షణ పొందుతారు? మరి ఎవరు విద్యాబుద్ధులు నేర్పుతారు? మరి ఎవరు శాస్త్రవేత్తలవుతారు? మరి కర్మాగారాలు ఎవరు నడుపుతారు? మరి ఎవరు కొత్తకొత్త విషయాలను ఆవిష్కరిస్తారు (కనిపెడతారు)? మరి ఎవరు శాస్త్రవిషయాల్లో పండితులవుతారు? పరిణామంలో ఏ పరిస్థితి ఏర్పడుతుంది? దీనిని తలుచుకొంటేనే ఒళ్ళు గగుర్పొడుస్తుంది.

మృత్యువును ఎవరూ ఆపలేరు. జన్మించిన తరువాత మరణించడం అనివార్యం మరే ఇతర క్రియ మరణమంత నిశ్చితమూ, అనివార్యమూ కాదు. ఒకపిల్లవాడు పుట్టాడను కొందాం! వాడు పెద్దవాడు అవుతాడా? కాడా? వాడు బాగా చదువుకొంటాడా? చదువుకొనడా? వ్యాపారం, ఉద్యోగం మొదలైనవి చేస్తాడా? చెయ్యడా? డాక్టరో, ఇంజనీరో అవుతాడా? కాడా? ధనవంతుడవుతాడా? కాడా? పెళ్ళి చేసుకొంటాడా? చేసుకోడా? వాడికి సంతానం ఉంటుందా? ఉండదా? మొదలైన విషయాల్లో అన్నీ సందేహాలే! కాని వాడు మరణిస్తాడా? మరణించడా? అనే విషయంలో మాత్రం ఎట్టి సందేహం ఉండదు. వాడు మరణించే తీరుతాడు. అట్టి అనివార్యమైన మృత్యువు ప్రతిక్షణం పొంచే వుంటుంది. ఎవరో ఒక మనిషి మరణించకుండా వుండని సంవత్సరంగాని, మాసంగాని, రోజుగాని, గంటగాని, నిమిషంగాని, చివరికి సెకండు కూడా ఉండదు. పిల్లలూ మరణిస్తారు. యువకులూ మరణిస్తారు. వృద్ధులూ మరణిస్తున్నారు. రోగులూ మరణిస్తున్నారు. రోగ రహితులూ మరణిస్తున్నారు.

నేనొకటి విన్నాను. అదేమిటంటే ఒకాయనకు ఇద్దరు మగపిల్లలుండే

వారు. వాళ్ళిద్దరూ మరణించారు. పాపం ఇప్పుడు ఆ ముసలి తల్లిదండ్రులకి మంచినీళ్ళు ఇచ్చేవాళ్ళుకూడా లేరు. మరొకాయనకు ఆరేడుగురు సంతానం ఉండేది. అయినప్పటికీ ఒక్కడే బతికి బట్టగట్టి, మిగతా వాళ్ళంతా మరణించారు. ఒకళ్ళిద్దరు సంతానంతో కుటుంబనియంత్రణ శస్త్రచికిత్స చేయించుకొన్నారనుకోండి. వాళ్ళసంతానం ఒకవేళ ప్రారబ్ధవశాత్తూ బతికి బట్టగట్టలేదనుకోండి. అప్పుడు వాళ్ళ పరిస్థితి ఏమవుతుందో? ఒకసారి ఆలోచించండి!

సందేహం:- జపాను, ఇజ్రాయిల్, బ్రిటన్‌వంటి దేశాల్లో జనసంఖ్య తక్కువ ఉన్నప్పటికీ వాళ్ళు చాల అభివృద్ధిని సాధిస్తున్నారు. మరి భారతదేశం జనాభా ఎక్కువగా ఉన్నప్పటికీ మనదేశం నిరుద్యోగం, పేదరికం మొదలైన కారణాలవల్ల వెనకబడి ఉంది కదా! అందువల్ల భారతదేశం అభివృద్ధి చెందాలంటే అధికజనాభా అవసరంలేదు. పైగా జనాభాని ఇంకా తగ్గించాల్సిన ఆవశ్యకత కూడా ఉంది. ఎందుకంటే అనేకమైన మేకలకంటే ఒక సింహం శ్రేష్ఠమైనది కదా!

సమాధానము:- నేను ఇటు జనాభా పెరుగుదలను కోరే పక్షానికి చెందను. అటు జనాభా నియంత్రణ కోరే పక్షానికి చెందను. నేను ప్రజలకు మేలు జరిగే పక్షానికి చెందినవాణ్ణి. జనసంఖ్య పెరగాలని కోరుకోవడం మూర్ఖత్వమైతే, తగ్గించాలని కోరుకోవడం కూడా మహా మూర్ఖత్వమవుతుంది. ఎందుకంటే ఈ పని మానవులది కాదు. పైగా అది దైవానిదీ, ప్రకృతిది. జనాభా పెరుగుదల పెద్ద హానికరమేమీకాదు. సంతాననిరోధక కృత్రిమ పద్ధతులద్వారా జనసంఖ్యను తగ్గించే చేష్టలే అత్యంత హానికరాలు. ఎందుకంటే ఈ పద్ధతుల ప్రచారప్రసారాలవల్ల సమాజంలో ప్రత్యక్షంగానే వ్యభిచారం, భోగపరాయణత్వం మొదలైన దుర్గుణాలు వృద్ధిపొందుతున్నాయి. అంతేకాదు. చరిత్ర, శీలం, సంయమనం, లజ్జ మొదలైన సద్గుణాలు క్షీణించిపోతున్నాయి. ప్రజల్లో శీలం, సత్ప్రవర్తన వంటి సద్గుణాలు లేకుండా పోయినప్పుడు దేశం బలోపేతమెలా అవుతుంది? ఆంగ్లములో ఒక లోకోక్తి ప్రచారంలో ఉంది.

**If wealth is lost, nothing is lost.**
**If health is lost, something is lost.**
**If character is lost, everything is lost.**

జపానువంటి దేశాల్లో అభివృద్ధి కనిపిస్తుందంటే అది తక్కువ జనాభావల్ల మాత్రం కాదు. నిజానికి అక్కడి ప్రజల కర్తవ్యపరాయణత్వం, నిజాయితీ, పరిశ్రమ (కష్టపడి పనిచేసే గుణం) దేశభక్తి వంటి లక్షణాల కారణంగానే అది కనిపిస్తోంది. మనదేశం వెనకబడటానికి (నిరుద్యోగం, పేదరికం) కారణం. జనాభా పెరుగుదలకాదు. అసలు కారణం అకర్మణ్యత, శీలహీనత, సోమరితనం, అలక్ష్యం, దురాచారాల పెరుగుదలే! అయితే ఇక్కడ కర్మణ్యత, సచ్ఛీలం, సంయమనం, త్యాగంవంటి సద్గుణాలపై దృష్టిని కేంద్రీకరించకుండా దుర్గుణాలను పెంచి పోషించే సంతాన నిరోధక పద్ధతుల మీదనే దృష్టిసారిస్తున్నారు. ఇది దేశానికి అత్యంత హానికరం. ఉదాహరణకు సినిమాలు, వీడియోలు, వార్తాపత్రికలు, మేగజైన్లు మొదలైన వాటిద్వారా ప్రజల శీలాన్ని, ప్రవర్తనని భ్రష్టుపట్టిస్తున్నారు. వారికి వ్యభిచారం, హింస, దొంగతనం వంటి వాటిలో శిక్షణ ఇస్తున్నాయి. ప్రతిచోటా బ్రాందీ షాపులు తెరచి, "పాన్‌మసాలా" వంటి వస్తువుల్ని ప్రచారం చేసి ప్రజల్ని వ్యసనపరులుగా తయారు చేస్తున్నారు. విభిన్నపద్ధతుల్లో ప్రజల్ని తక్కువ పనిచేసేలా దుబారా ఖర్చులు, విలాసాలు పెంచి, "వారానికి ఐదురోజులే పనిచెయ్యండి! ఫలానా రోజున దుకాణాలు తెరవండి. అంటూ పనిపాటాలేకుండా విశ్రాంతి తీసుకొనేలా, ప్రోత్సహిస్తున్నారు. ఉద్యోగస్థులు పని ఎక్కువచేసినా, తక్కువచేసినా, జీతం మాత్రం పూర్తిగానే ఇస్తున్నారు. మరి అలాంటప్పుడు వాళ్ళు ఎక్కువ పని చెయ్యాలనే ప్రయత్నం (పరిశ్రమ) ఎందుకు చేస్తారు? వాళ్ళు పేకాటలు (జూదం), టీ తాగటం, బీడీలు తాగటం, సిగరెట్లు కాల్చడం వంటి వృథాకార్యక్రమాల్లో సమయాన్ని దుర్వినియోగం చేసుకొంటున్నారు. ప్రభుత్వ కార్యాలయములలో లంచంలేనిదే ఏ పనీ పూర్తవటంలేదు. ప్రతిరంగంలో దురాచారాలు వ్యాపించిపోతున్నాయి. రక్షకుడైన వాడే భక్షకుడై కూర్చుంటున్నాడు. పదవికి తగిన విధంగా పనిచేసే సామర్థ్యం లేనివాణ్ణి కులం ఆధారంగా ఆ పదవిలో నియుక్తుణ్ణి చేస్తున్నారు. (పదవికి)

యోగ్యుడైన వానికి ఉద్యోగమే దొరకడం లేదు. పాఠశాలల్లో పిల్లల్ని చేర్చుకోడానికి వేలకొలది రూపాయలు లంచం తీసుకుంటున్నారు. పైగా దాన్ని "డోనేషన్" (విరాళం) అని కూడా పిలుస్తున్నారు. ఉపాధ్యాయులు స్కూళ్ళల్లో పిల్లలకి సరిగ్గా పాఠాలు చెప్పకుండా ట్యూషన్లు పెట్టించుకోడానికి ప్రేరేపిస్తున్నారు.

స్వదేశీ జొన్నవిత్తనాలు వేసినచో, ఒకమొక్కకు సుమారు వంద కంకులు దిగుబడి లభిస్తోంది. కాని ప్రభుత్వం రైతులకు స్వదేశీ విత్తనాల సరఫరా చేయకుండా విదేశీయ విత్తనాలనే అందిస్తోంది. దీనివల్ల ఒక్కమొక్కకు ఒకకంకియే ఉత్పత్తియగును. ఇదేమి బుద్ధియో! అర్థంకావడంలేదు.

ప్రజల దగ్గర ధనధాన్యసంపత్తి పుష్కలంగా ఉండి వైషమ్యాలు లేకుండా ఉండే రాజ్యమే ఉత్తమంగా ఉంటుంది. కాని ఈ రోజుల్లో భిన్నభిన్న వర్గాల్లో ఒకరిమీద ఒకరికి ద్వేషభావం కలిగించి పరస్పరం కలహించుకొనేలా చేస్తున్నారు. ఇర్వురూ ఒకళ్ళకొకళ్ళు ఇతరవ్యక్తుల్ని, వాళ్ళ ఆస్తుల్ని నాశనం చేసుకొంటున్నారు. చివరికి కాలక్రమంలో దేశంయొక్క ప్రజలు, ప్రజలసంపదే నాశనమవుతున్నాయి. దేశప్రజలు, వారిసంపత్తి నాశనమవుతుంటే ఆ దేశం సుఖవంతమూ, సమృద్ధిమంతమూ, ఎలా అపగలదు? ఇంకా ఆ దేశంలో సుఖశాంతులు ఎలా వర్ధిల్లుతాయి?

ఇలా దేశవ్యవస్థను పాడుచేసే కారణాలు అనేకం ఉన్నాయి. ఇలాంటి స్థితిలో జనసంఖ్యను తగ్గించుకొన్నంత మాత్రాన నిరుద్యోగం, పేదరికం దూరమవుతాయా? కావు. సరిగదా! పైపెచ్చు దేశం బలహీనమూ, పరాధీనమూ అయిపోతుంది.

జనాభాను తగ్గించటంవల్ల అందరూ సింహంలా బలవంతులుగా సిద్ధంకారు. సింహానికి బ్రహ్మచర్యాన్ని పాటించే శక్తి ఉంది. మరి సంతాననిరోధక పద్ధతులద్వారా బ్రహ్మచర్యశక్తి నాశనమవుతోంది.

ఎందుకంటే సంతాననిరోధక కృత్రిమ పద్ధతుల అసలు భావమేమిటంటే- "అనుభవించేది అనుభవించండి, బ్రహ్మచర్యాన్ని నాశనం చెయ్యండి. కాని సంతానం మాత్రం లేకుండా చూడండి" అని. నిజానికి సంతాననిరోధమే సాధించాలంటే బ్రహ్మచర్యాన్ని తప్పక పాటించాలి.

నిజానికి జనాభాపెరుగుదల నా ఉద్దేశ్యం కాకపోయినప్పటికి ఒకవేళ ఎవరైనా నేను జనాభావృద్ధి గురించే మాట్లాడుతున్నానని భావించినాసరే! అదేమీ అనుచితమైన విషయం కాబోదు. ఎందుకంటే శాస్త్రగ్రంథాల్లో జనసంఖ్యను పెంచే ఆదేశమే ప్రస్తావింపబడిందే గాని జనసంఖ్యను తగ్గించే ఆదేశం ఎక్కడాలేదు. మరోమాట! నేటికాలం "ఓట్ల" మీద నడుస్తోంది. సింహం ఉత్తమమైనదీ, శ్రేష్ఠమైనదీ, మహాబలమైనదే కావచ్చు. ఓట్ల విషయానికి వచ్చేసరికి ఓట్లు తక్కువ వచ్చాయనుకోండి! సింహం ఓడిపోతుంది. అంతే అంతా గొఱ్ఱెల రాజ్యమైపోతుంది.

సంతాన నిరోధక కృత్రిమ పద్ధతుల ప్రచారంవల్ల స్త్రీ పురుషులిద్దరూ బ్రహ్మహత్యాపాతకంకంటే రెట్టింపు పాపకారకమైన భ్రూణహత్యలూ, లేదా గర్భస్రావాలకు పూనుకొంటూ గర్భస్థశిశువులను చంపుకోడానికి కూడా వెనుకాడనంతగా క్రూరాత్ములు, దయారహితులు, హింసాత్ములు అయిపోతున్నారు. * గర్భవిచ్ఛిత్తి చేసుకొనే స్త్రీ తనసంతానాన్ని భక్షించే "సర్పిణి" (పాము) లాంటిది. గోవు చాలా సాధువు అయినది. అయినా అది కూడా ఎవరినీ తన దూడదగ్గరకు రానీయదు. కాని ఈ కాలపు ఆడవాళ్ళు ఆవులాగా ఉండకపోగా సర్వథా జ్ఞానంలేని

---

యత్పాపం బ్రహ్మహత్యాయ ద్విగుణం గర్భపాతనే ।
ప్రాయశ్చిత్తం న తస్యాస్తి తస్యాస్త్యాగో విధీయతే ॥

(పారాశరస్మృతి. 4/20)

బ్రహ్మహత్యవల్ల కలిగే పాపంకంటే రెట్టింపు పాపం గర్భవిచ్ఛిత్తి (గర్భపాతం) చేయించుకోవడంవల్ల కలుగుతుంది. ఇలాంటి గర్భపాతాది మహాపాపాలకు ప్రాయశ్చిత్తంలేదు. ఇందులో ఇంకా అట్టి స్త్రీని త్యజించాలని (విడిచిపెట్టాలని) కూడా విధించబడింది.

మూర్ఖమైన గొఱ్ఱెల్లా అయినా ఉండటం లేదు. పైపెచ్చు మహా విషపూరితమైన సర్పిణుల్లా తయారవుతున్నారు. మాతృమూర్తితో సమానంగా పెంచి పోషణ చేసేవాళ్ళు మరెవరూ ఉండరు. "మాత్రా సమం నాస్తి శరీరపోషణమ్" నేటి కాలపు స్త్రీలకు తమ సంతానం ఆలనాపాలనా చూసుకోవడం కష్టదాయకమనిపిస్తోంది. ఇది ఎంత నైతిక పతనమైన విషయము!

సందేహం:- విదేశాల్లోని ప్రజల శీలం భ్రష్టమైపోతుంది. అక్కడా వ్యభిచారం, హింస లాంటి పాపాలు పెచ్చు పెరిగిపోతునే ఉన్నాయి. అయినా ఆ దేశాలు అభివృద్ధిలో ఎందుకున్నాయంటారు?

సమాధానం:- ఆ ఉన్నతి భౌతికమైనది. భౌతికమైన ఉన్నతి వాస్తవానికి ఉన్నతికాదు. ఆధ్యాత్మికమైన ఉన్నతే (అభివృద్ధి) నిజమైన ఉన్నతి. ఎవరికైతే ఆధ్యాత్మిక దృష్టి లేదో వారికి కేవలం భౌతిక ఉన్నతి మాత్రమే గొప్పదిగా కనిపిస్తూంటుంది. ఇతరదేశాల్లో భౌతికమైన ఉన్నతి కనిపించినా అక్కడి ప్రజలు అంతరంగంలో అశాంతి, దుఃఖం, విచారాలతో దహించుకుపోతున్నారు. ఈ కారణంగా అచ్చట ఆత్మహత్యలు పెరుగుతున్నాయి. భౌతికమైన ఉన్నతియొక్క ఫలితం వినాశమే! పూర్వం మనదేశంలో కూడా రాక్షసుల్లో భౌతికమైన ఉన్నతి ఉండేది. అయినా వారు ఇతరులనూ నాశనం చేశారు, వారంతట వారు నాశనమయ్యారు. రావణాసురుడు చాల గొప్ప భౌతిక ఉన్నతినే సాధించాడు. ఫలితముగా అతడికీ, అతని ప్రజలకూ, చివరికి అతని భౌతికమైన ఉన్నతి అంతటికీ నాశనమే సంభవించింది. అంతా నాశనమయ్యాక వెనకాల రోదించేవాళ్లు కూడా లేకుండా పోయారు.

మహాభారతంలో (అరణ్యపర్వం. అధ్యాయం. 97) ఒక ఉపాఖ్యానం ఉంది. అగస్త్యమహర్షి భార్య లోపాముద్ర ఒకసారి సుందర వస్త్రాభూషణాలు కావాలని కోరింది. ధనసంపాదనకోసం అగస్త్యుడు క్రమముగా ముగ్గురు రాజులదగ్గరకు వెళ్ళాడు. వెళ్ళినాయన ముగ్గురురాజుల ఆదాయవ్యయాల లెక్కలు సమంగా ఉండటం గమనించాడు. వీళ్ళదగ్గర ఏకొద్దిపాటి ధనం తీసుకొన్నా ప్రజలకు దుఃఖం వాటిల్లుతుంది అనే

ఆలోచనలో పడి, ఆ రాజుల దగ్గరనుంచి ఏమీ గ్రహించలేదు – రాజులు వాళ్లల్లో వాళ్ళు చర్చించుకొని "ఇల్వలుడు అనే రాక్షసుడున్నాడు. అతగాడు అందరికంటే ధనవంతుడు. కాబట్టి ధనప్రాప్తికోసం ఆయన దగ్గరికే వెళ్ళాల్సి ఉంటుందని" చెప్పి ఆ ముగ్గురు రాజులు అగస్త్యునితో కలిసి ఇల్వలుడి వద్దకు వెళ్ళారు. ఆయనకు చాలా ధనం లభించింది. అవసరాన్ని మించిన అధిక ధనసంపద యక్షరాక్షసులవద్ద మాత్రమే ఉంటుంది గాని, రాజులదగ్గర ఉండదనేది ఇక్కడ గ్రహించాల్సిన విషయం – అందుచేత ధనాన్ని కూడబెడుతూ దానిని రక్షించుకొంటూ ఉండేవాణ్ణి "యక్షవిత్తుడు" అంటారు. యక్షవిత్తుడికి నాశనమే కలుగుతుంది. "యక్షవిత్తః పతత్యధః" (శ్రీమద్భాగవతం. 11/23–24)

## మాతృశక్తిపై నిరాదరణ

ఈ రోజుల్లో స్త్రీజాతిని దారుణంగా నిరాదరిస్తూ, ఘోర అవమానాల పాలు చేస్తున్నారు. మహిళల్లోని మహనీయమాతృమూర్తిని నాశనం చేస్తూ ఒక భోగవస్తువుగా రూపుదిద్దుతున్నారు. భోగ్యస్త్రీ అనగానే వేశ్య అవుతుంది. మాతృమూర్తి కాలేదుగదా! మాతృమూర్తికున్నంత గౌరవమర్యాదలు భోగ్యస్త్రీకి ఉండవుగదా! అయినప్పటికి కులకాంతలను భోగ్యవస్తువుగా భావిస్తూ కాంతదాసులై సంచరించే విలాసపురుషులు ఈ విషయాన్ని ఎలా గ్రహిస్తారు? వారు ఏమాత్రం గ్రహించజాలరు కూడా! వివాహం అనేది స్త్రీని మాతృమూర్తిని చేయడానికి నిర్వహింపబడుతున్న సంస్కారమే గాని, ఆమెను భోగ్యవస్తువుగా తయారుచేయడానికి కాదు. సంతానాన్ని వృద్ధిచేయడానికే తండ్రి కన్యాదానం చేస్తున్నాడు. అలాగే వంశవృద్ధికోసమే వరుడుకూడా కన్యాదానాన్ని స్వీకరిస్తున్నాడు. కాని ఈ రోజుల్లో మహిళను మాతృమూర్తికావడాన్ని నిరోధిస్తూ ఆమెను కేవలం ఒక విలాసవస్తువుగా తయారుచేస్తున్నారు. ఇది స్త్రీజాతిపట్ల ఎంతటి నిరాదరణ!

వాస్తవానికి స్త్రీ ఒక మాతృశక్తి. ఆమె స్త్రీ పురుషులిద్దరికి జనని. ఆమె పురుషుడికే భార్య. కాని స్త్రీ పురుషులందరికి మాతృమూర్తి. పురుషుడు ఉత్తముడైతే కేవలం అతని వంశమే మహిమాన్వితమవుతుంది.

స్త్రీగనక ఉత్తమురాలైతే అటుపుట్టిన వంశమూ, ఇటు మెట్టిన వంశమూ రెండూ మహిమాన్వితాలవుతాయి. జనక మహారాజు సీతతో ఇట్లనెను, "పుత్రి పబిత్ర కిఏ కుల దోఊ" (మానస. అయోధ్య. 287/1) (పుత్రీ! నీవు రెండు కులాలను పవిత్రము చేసితివి.)

ఈ రోజుల్లో పెళ్ళికిముందు కన్యయొక్క స్వభావము, సహనము, ఆస్తికస్వభావము, దైవభక్తి, కార్యకుశలత మొదలైన గుణాలను చూడకుండా ఆమె సౌందర్యాన్నే చూస్తున్నారు. పెళ్ళిచూపులు సమగ్రదృష్టితో కాకుండా తాత్కాలికమైన భోగదృష్టితో జరుపుతున్నారు. మంచి గుణం కలకాలం తోడుంటుంది గాని సౌందర్యం ఎంతకాలం ఉంటుంది? * విలాస పురుషుడికి ప్రపంచంలోని స్త్రీలందరూ లభించినా తృప్తి ఏర్పడదు –

యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవస్త్రియః ।
నదుహ్యన్తి మనః ప్రీతిం పుంసః కామహతస్య తే ॥
(శ్రీమద్భాగవతం. 9/19/13)

"కోరికలతో కొట్టుమిట్టాడే పురుషుడికి భూమండలం మీద ఉన్న ధాన్యం, బంగారం, పశువులు, స్త్రీలు అన్నీ కలిసి లభించినా ఆ మనస్సుకు తృప్తి పరచలేవు. అతడు తాను పెంచుకొన్న కోరికలవలన హతుడవుచున్నాడు.

అలాంటి భోగపురుషులే కుటుంబనియంత్రణం, గర్భస్రావం వంటి

---

* ద్రౌపది అత్యంత సౌందర్యవతి కావడంవల్లనే జయద్రథుడు, కీచకుడు, ఇంకా పద్దెనిమిది అక్షౌహిణుల సైన్యం చంపబడింది. కాబట్టి చాణక్యనీతి ఇలా పేర్కొన్నది –

ఋణకర్తా పితా శత్రుః మాతా చ వ్యభిచారిణీ ।
భార్యా రూపవతీ శత్రుః పుత్రః శత్రురపండితః ॥
(చాణక్యనీతి. 6/10)

ఋణగ్రస్తుడైన తండ్రి, వ్యభిచారిణియైన తల్లి, సౌందర్యవంతురాలగు భార్య, మూర్ఖుడైన కొడుకు వీరు నలుగురు శత్రువుల్లాంటి వారు.

పాపాలకొడిగడతారు. వివాహం వంశవృద్ధికోసం చేయబడుతోంది. తల్లి స్వభావమే తరచు సంతానానికి సంక్రమిస్తుంది. కాబట్టి కన్య గనకసద్గుణవంతురాలు, సదాచారపరురాలు అయితే వివాహానంతరం ఆమె సంతానంకూడా సద్గుణవంతులు, సదాచార పరులూ అవుతారు.

కన్యను దానం చెయ్యడంలో కూడా ఆమెపై గౌరవమే ఉంది కాని నిరాదరణ లేదు. ఇది ఇతర దానాలవంటిది కాదు. ఇతర దానాల విషయంలో అయితే దానమిచ్చిన వస్తువుల మీద దాతకు అధికారముండదు. అదే కన్యాదానం విషయంలో సంతానం కలిగాకకూడ తల్లిదండ్రులకు కన్యమీద అధికారం ఉంటుంది. అవసరమయితే వాళ్ళు ఆమె ఇంట్లో అన్నపానాదులు సైతం గ్రహించవచ్చు. ఎందుచేతనంటే కన్యయొక్క భర్త కేవలం పితృఋణం నుంచి విముక్తుడవటానికే కన్యను స్వీకరిస్తాడు. ఆమె ద్వారా సంతానం కలిగాక అతడు పితృఋణమునుంచి విముక్తుడవుతాడు. ఇందువల్లనే గోత్రప్రవరాదులు ఇంకొకరివైనా దౌహిత్రుడు తాతగారికి, అమ్మమ్మగారికి శ్రాద్ధతర్పణాలు చేస్తాడు. ఇదిలోకంలో, శాస్త్రాల్లో ప్రసిద్ధంగానే ఉంది.

మన శాస్త్రగ్రంథాల్లో స్త్రీజాతికి చాల గౌరవం ఇవ్వబడింది. ఎక్కడా ఎదురుదెబ్బలు తినకుండా, వేశ్యలుగా దిగజారిపోకుండా ఉండేందులకే, స్త్రీకి రక్షణ ఇవ్వాలనే ఉద్దేశంతోనే ఆమెను తండ్రి, భర్త, పుత్రుల ఆశ్రయంలో ఉండేలా అనుమతించారు. * స్త్రీ ఉద్యోగం చెయ్యడముందే అది ఆమెకు అగౌరవమే! ఆమె గొప్పతనమంతా ఆమె గృహిణిగా గృహసీమనలంకరించటంలోనే ఉంటుంది. ఇంట్లో ఆమె మహారాణి. అదే ఆమె ఇంటి వెలుపల అయితే ఉద్యోగస్థురాలే! ఇంట్లో ఒకే పురుషుని

---

* భ్రమన్ సంపూజ్యతే రాజా భ్రమన్ సంపూజ్యతే ద్విజః ।
భ్రమన్ సంపూజ్యతే యోగీ భ్రమంతీ స్త్రీ వినశ్యతి ॥

(చాణక్యనీతి. 6/4)

రాజు, బ్రాహ్మణుడు, యోగి – వీరందరూ తిరుగుచుండుటచే పూజింపబడుదురు. కాని తిరుగుటచే స్త్రీ పతనమగును.

అధీనంలో ఉండే ఆమె ఇంటిబయట అనేకమంది స్త్రీపురుషుల అధీనంలో ఉండాల్సి వస్తుంది. ఆమె కోమల హృదయ విరుద్ధంగా తనకంటే పైఅధికారుల ఆధీనతలో, దూషణ భూషణ తిరస్కారాలను సహించాల్సి వస్తుంది. ఆమె ఆదరణీయయేగాని, తిరస్కారయోగ్యురాలు కాదు. ఆమెను తండ్రి, భర్త, పుత్రుల అధీనంలో ఉంచటం నిజానికి స్త్రీని "పరాధీన"గా మార్చాలని కాదు. (పైగా) ఆమెను "స్వావలంబిని" గా మార్చటానికి మాత్రమే!

ఇంట్లో ఉండే నాయనమ్మగారిని, అమ్మమ్మగారిని అందరూ గౌరవిస్తారు. అదే వీధుల్లో కనబడే ముసలమ్మను అన్నిచోట్లా తిరస్కరిస్తూనే ఉంటారు గదా!

స్త్రీలు బయటి పనులు సరిగా చెయ్యలేరు. అలాగే పురుషులు ఇంటిపనులు సరిగా చెయ్యలేరు. స్త్రీలు ఉద్యోగాలు చేస్తే అక్కడ కూడా స్వెట్టర్లు అల్లుతారు. ఇంటిపనులు చేస్తారు. పురుషులు "ఆడవాళ్ళు ఏం పని చేస్తున్నారు? పనంతామేమే చేస్తున్నాం. డబ్బులు సంపాయిస్తున్నాం" అంటూ బడాయిలు పలుకుతారు. ఓరోజు వంటింటి పనిచేసి, పిల్లల్ని ఒడిలో కూర్చోబెట్టుకొని సాకితే అప్పుడు తెలుస్తుంది ఆడవాళ్లేంపని చేస్తున్నారో! ఒకవేళ స్త్రీ మరణిస్తే తల్లి లేని పిల్లల్ని సాకలేక మగవాళ్ళు పిల్లలని అత్తగారింటికో, అమ్మమ్మగారింటికో, చెల్లెలి గారింటికో, మేనత్తగారింటికో పంపుతూంటారు. అదే భర్త మరణిస్తే స్త్రీ కష్టాలను సైతం ఓర్చుకొని, పిల్లలను పెంచి పోషించి చదువుసంధ్యలు చెప్పించి యోగ్యులుగా తీర్చిదిద్దుతుంది. దీనికి కారణం ఆమె మాతృమూర్తి (శక్తి) కావడమే! పిల్లల్ని పోషించేయోగ్యత కల్గి ఉండటమే! నేను చిన్నచిన్న బాలబాలికలను చాలామందిని చూశాను. ఆడపిల్లలకి ఏదైనా తినుబండారం లభిస్తే వాళ్ళు దానిని చెల్లెలికో, తమ్ముడికో ఇవ్వాలని జేబులో దాచుకొంటారు. అదే మగపిల్లలకి ఏదైనా తినుబండారం దొరికితే మాత్రం వాళ్ళు అక్కడికక్కడే తినేస్తారు. పురుషులకు ఎవరైనా సాధువు, పేదవాళ్ళు, భిక్షుకులు తారసపడితే పక్కనుంచి తప్పుకుపోతారే గాని, మనసులో వాళ్ళకు ఏదైనా పెట్టాలనే ఆలోచనే రాదు. కాని అదే

స్త్రీలయితే జాలి కలిగి ఉంటారు కాబట్టే "బాబాజీ! కొంచెం ఏదైనా తీసుకోంటారా?" అని అడిగి వారికేదైనా అందజేస్తారు. వారు పిల్లల్ని పోషించాల్సి ఉంటుంది కాబట్టే ఆ పరమాత్ముడు వారికి దయాహృదయాన్నిచ్చాడు.

నేటి కాలంలో స్త్రీలకు, పురుషులతో సమానంగా అధికారం ఇవ్వాలని మాట్లాడుతున్నారు గాని శాస్త్రాల్లో మాతృమూర్తిగా స్త్రీలకు పురుషునికంటే విశేషాధికారాలే ఇచ్చారు.

"సహస్రం తు పితౄన్మాతా గౌరవేణాతి రిచ్యతే ।"

(మనుస్మృతి 2/145)

"తల్లియొక్క స్థానము తండ్రికంటే వెయ్యిరెట్లధికంగా భావింపబడింది".

"సర్వవంద్యేన యతినా ప్రసూర్వంద్యా ప్రయత్నతః ॥"

(స్కంద పురాణం. కాశీ. 11/50)

"సమస్త జనులచే వందనీయుడైన సన్న్యాసి కూడా తల్లికి విధిగా వందనాలర్పించాల్సి ఉంది."

ఈ రోజుల్లో గర్భపరీక్షలు జరుపుకొంటూ గర్భస్థశిశువు ఆడపిల్లయితే గర్భవిచ్ఛిత్తి చేసుకొంటున్నారు గదా! దీన్ని స్త్రీకి సమానాధికారాలు ఇస్తున్నట్లేనంటారా?

"అమ్మ" అనే శబ్దం ఉచ్చరించినపుడు అన్నప్పుడు కలగదు. కనుకనే శ్రీ శంకరభగవత్పాదులు మహానుభావుడైన శ్రీకృష్ణపరమాత్మను కూడా మాతా! అనే సంబోధించారు. "మాతః కృష్ణాభిధానే" (ప్రబోధ. 244) ఉపనిషత్తులు కూడా "మాతృదేవో భవ", "పితృదేవో భవ" అని ఉపదేశిస్తూ ప్రప్రథమంగా మాతృమూర్తి సేవ చెయ్యాలనే ఆదేశించాయి. "వందే మాతరమ్" అన్నప్పుడు కూడా మాతృవందనమే చెయ్యబడింది. హిందూధర్మంలో మాతృశక్త్యుపాసనకు

విశేష మహిమ ఉన్నది. ఈశ్వరకోటిలోని పంచదేవతలలో కూడా మాతృశక్తికి (భగవతి) స్థానమేర్పరుపబడింది. దేవీభాగవతం, దుర్గాసప్తశతి లలితా సహస్రనామము ఇత్యాది గ్రంథాలు మాతృశక్తి మీదనే రచింపబడ్డాయి. లోకంలోని సమస్త స్త్రీలను మాతృస్వరూపంగానే భావించారు.

విద్యాః సమస్తాస్తవ దేవి భేదాః ।
స్త్రియః సమస్తాః సకలా జగత్సు ॥
(దుర్గసప్తశతి. 11/6)

కాని విలాసపురుషులు మాతృశక్తిని ఏం అర్థం చేసుకోంటారు? అర్థం చేసుకోలేరు సరికదా! వారు స్త్రీలను భోగవస్తువుగానే భావిస్తారు.

శాస్త్రగ్రంథాల్లో స్త్రీని పునర్వివాహం చేసుకోకుండా వైధవ్యాన్నే పాటించాలని చెప్పడం నిజానికి వారియెడల ఆదరణేగాని, నిరాదరణ ఎంతమాత్రమూ కాదు. ధర్మపాలనకోసం కష్టాలను సహించటం అవమానంకాదు. అది ఓర్పు, తపస్సు అవుతుంది. సహనవంతులు, తపస్వులు అయిన వ్యక్తులకు సమాజంలో మంచి ఆదరం ఉంటుంది. పురుషులు స్త్రీలను తిరస్కరించండి, దుఃఖం కల్గించండి, వారికి విడాకులు ఇవ్వండి, వాళ్ళను కొట్టండి – అని ఎక్కడా, ఏ శాస్త్రాలలోను చెప్పబడలేదు. అంతేకాదు స్త్రీలవల్ల మహాపరాధం జరిగినా వాళ్ళను దండించే శాసనం ఎక్కడాలేదు. అంతకుమించి చెప్పాలంటే స్త్రీ సదా క్షమార్హురాలు.

భీష్మపితామహుడు కౌరవసేనా రక్షణభారం వహించియున్నాడు. "అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్" (గీత. 1/10) అయినా దుర్యోధనుడు ఆయనక్కూడా రక్షణ కల్పించటంకోసం తన సేనకు ఆదేశాలిచ్చాడు. "భీష్మమేవాభిరక్షంతు భవన్తః సర్వ ఏవ హి" (గీత. 1/11) ప్రాణాలు పోయినా సరే! శిఖండి ఎదురుగావస్తే భీష్మాచార్యుడు ఆమెపై ఎప్పుడూ శస్త్రాలను సంధించడనే విషయం దుర్యోధనుడెరుగును. కాబట్టే అటువంటి ఆదేశాలు ఇచ్చినాడు. శిఖండి మొదట స్త్రీగా జన్మించెను. కాని శ్రీ శంకరుని వరప్రభావముచే పురుషునిగా మారినది.

ఆమె పురుష రూపములో నున్నను, భీష్ముడు ఆమెను స్త్రీగానే పరిగణించెను. మరియు తన ప్రాణములు పోయినను, అతనిపై శస్త్రములు వేయడు. ఇది స్త్రీ జాతికి ఎంత గౌరవము!

శాస్త్రగ్రంథాల్లో, పురుషులకోసం సంధ్యావందనం, అగ్నిహోత్రం, యజ్ఞం, వేదపారాయణము మొదలైన విధ్యుక్తధర్మాలను ఏర్పరచారు. కాని స్త్రీలకు ఆ విధ్యుక్తధర్మాలనుండి, పితృఋణంవంటి ఋణాలనుండి మినహాయింపు కల్పించారు. * ఇంకా ఆమెకు పతిపుణ్యసంపదలో అర్ధభాగానికి వాటాదారుగా చేశారు.

కాని శాస్త్రజ్ఞానం లేనివారు ఈ విషయాన్ని ఎలా అర్థం చేసుకొంటారు? నేడు స్త్రీలను వారివారి కర్తవ్యాలనుండి విముఖులను చేసి అనేకమైన చిక్కుల్లో పడేస్తున్నారు. శాస్త్రాలు కేవలం పురుషులే యజ్ఞోపవీతాన్ని ధరించి సంధ్యావందనాది విశేషకర్మలు నిర్వర్తించటానికి అనుమతినిచ్చాయి. కాని ఈనాటి స్త్రీలకు యజ్ఞోపవీతాన్ని ధరింపజేసి విపరీత విపత్కర పరిస్థితుల్లో పడేస్తున్నారు. ఇదేమైనా తెలివైన విషయమా? భార్య, భర్తద్వారా చేయబడే పుణ్యకర్మల్లో (ఫలంలో) భాగస్థురాలు. పాపకర్మల్లో మాత్రం కాదు. అర్ధభాగపు పుణ్యఫలం ఆమెకు

---

వైవాహికో విధిః స్త్రీణాం సంస్కారో వైదికః స్మృతః ।
పతిసేవా గురౌ వాసో గృహార్థోఽగ్నిపరిక్రియా ॥

(మను. 2/67)

స్త్రీలకు వైవాహిక విధిని నిర్వర్తించటమే వైదికసంస్కారం (యజ్ఞోపవీతం). పతిసేవయే గురుకులవాసం (వేదాధ్యయనం). గృహకార్యనిర్వహణే అగ్నిహోత్రంగా చెప్పబడింది –

ఏకఇ ధర్మ ఏక బ్రత నేమా ।
కాయఁ బచన మన పతి పద ప్రేమా ॥

(మానస. అరణ్య. 5/5)

స్త్రీజాతికి ఒకే ధర్మము, ఒకే వ్రతము, ఒకే నియమము. మనోవాక్కాయములందే పతిపదప్రేమ.

ఉచితంగానే లభిస్తోంది. డాక్టర్లు, విద్వాంసుల భార్యలు నిరక్షరాస్యులైనా, "డాక్టరమ్మగారూ" "పంతులమ్మగారూ! అని పిలిచి గౌరవిస్తూండటం మనం సమాజంలో చూస్తూనే ఉన్నాం. వాస్తవానికి నేడు అహంకారానికి ప్రాముఖ్యత ఇవ్వబడుతోంది. అందువల్లనే వినయసంపదను పెంచే మాటలను విస్మరించి, అహంకారాన్ని అతిశయింపజేసే మాటలేచెబుతున్నారు. నేర్పుతున్నారు. ఇవి పతనానికి హేతువులు. "మగవాళ్ళు అలాచేస్తున్నప్పుడు మనం ఎందుకు చేయకూడదు? మనం ఎందుకు వెనకబడి ఉండాలి?" ఇలాంటిమాటలు ఇవి కేవలం అహంకారాన్ని వృద్ధిచేసే మాటలు. అహంకారం జననమరణాలకు మూలం. అది సకలక్లేశదాయిని, సమస్త దుఃఖదాయిని కూడా –

సంసృత మూల సూలప్రద నానా । సకల సోక దాయక అభిమానా ॥
(మానస. ఉత్తర. 74/3)

అహంకారము జననమరణములకు మూలము. అన్ని కష్టములకు కారణము. సకల శోకదాయకము.

ఈ లోకం మేలుకోరి మాతృశక్తి చాల సేవచేసింది. రక్తబీజుని వంటి రాక్షసుల సంహారం ఈ మాతృశక్తి ద్వారానే జరిగింది. ఈ మాతృశక్తియే హిందూసంస్కృతిని పరిరక్షించింది. మన వ్రతములు, పండగలు, ఆచారవ్యవహారాలు, తల్లిదండ్రులకి సంబంధించిన పితృకార్యాల పరిజ్ఞానం, స్త్రీలకున్నంతగా పురుషులకు లేకపోవడాన్ని ఇప్పటికీ మనం ప్రత్యక్షంగా చూస్తూనే ఉన్నాం. పురుషులు తమ వంశానికి చెందిన విషయాలను కూడా మరచిపోతూంటారు. కానీ స్త్రీలు మాత్రం ఫలానారోజున తల్లిగారి లేదా తండ్రిగారి తిథి (ఆబ్దికము) మొదలైన విషయాలను తాను మరో వంశస్థురాలైనప్పటికీ ప్రస్తావిస్తూంటుంది. ఆలయములలో హరికథలు, భజనలు వంటి సత్సంగాలకు స్త్రీలు వెళ్ళినంతగా పురుషులు వెళ్ళరు. కార్తీకస్నానాలు, వ్రతాలు, దానాలు, పూజలు, రామాయణ పారాయణాలు స్త్రీలు జరిపినంతగా పురుషులు జరుపరు. అంటే మన సంస్కృతిని రక్షించే వాళ్ళు స్త్రీలేనన్నది ఇక్కడ మనం గ్రహించాలి! అలాంటప్పుడు

వాళ్ళ శీలమే భ్రష్టమైపోతే సంస్కృతియొక్క పరిరక్షణ ఎలా జరుగుతుంది?

అసంతుష్టా ద్విజా నష్టాః సంతుష్టాశ్చ మహీభుజః ।
సలజ్జా గణికా నష్టా నిర్లజ్జాశ్చ కులాంగనాః ॥
(చాణక్యనీతి. 8/18)

"అసంతుష్టుడైన బ్రాహ్మణుడు నష్టపోతాడు. సంతుష్టుడైన రాజు నష్టపోతాడు. లజ్జావతియైన వేశ్య నష్టపోతుంది. లజ్జావిహీనమైన కులకాంత కూడా నష్టపోతుంది. అనగా వారికి వినాశనమే సంభవిస్తుంది."

ఈ రోజులలో చేస్తున్న సంతాననిరోధక పద్ధతుల విస్తృత ప్రచారంవల్ల స్త్రీలలో లజ్జ, శీలం, పాతివ్రత్యం, సత్ప్రవర్తన, సదాచారం మొదలైనవి క్షీణించి పోతున్నాయి. ఫలితంగా స్త్రీజాతి కేవలం విలాసవస్తువుగా తయారవుతుంది. స్త్రీజాతి శీలమే భ్రష్టమైపోతే దేశపరిస్థితి ఏమయిపోతుంది? ప్రథమగురువుగా (భావింపబడే) తమ తల్లి ద్వారా రాబోయే తరంవాళ్ళు ఏ శిక్షణ పొందుతారు? స్త్రీ చెడిపోయిందంటే ఆమె ద్వారా జన్మించే పిల్లాపాపలు (ఆడ, మగ) ఇద్దరూ భ్రష్టులైపోతారు. కావున స్త్రీ సత్ప్రవర్తన కలిగియుంటే, పురుషుడు దుష్ప్రవర్తన కలిగియున్నను దాని ప్రభావము సంతానము మీద చూపదు. కాబట్టి స్త్రీలయొక్క శీలం, సచ్చరిత్ర, సత్ప్రవర్తన, లజ్జ మొదలైన వాటిని పరిరక్షించటం, వారు అవమానింపబడకుండా, నిరాదరింపబడకుండా చూడటం మానవమాత్రుల విధ్యుక్తధర్మం.

## ధర్మం యెడల తిరస్కారం

ధర్మంలేని నీతి విధవరాలి వంటిది. అలాగే నీతిలేని ధర్మం భార్యలేని పురుషునివంటిది. కాబట్టి ధర్మం, రాజనీతి రెండూ కలిసిమెలిసి ఉండాలి. అప్పుడే శాసనము ఉత్తమంగా సాగుతుంది. కాని నేడు ధర్మాన్ని నిరాదరిస్తున్నారు. ఇందుమూలంగానే దేశంలో వ్యభిచారం, హింస, దొంగతనం వంటి మూడు విధాలయిన పాపాలు వేగంగా వృద్ధి

చెందుతున్నాయి. ఈ మూడు పాపాలు ప్రజ్వరిల్లటంవల్ల దేశానికి భయంకరమైన పతనం సంభవిస్తుంది.

1. **వ్యభిచారాభివృద్ధి :-** సంతాననిరోధ ప్రచారప్రభావంవల్ల ఘోరమైన వ్యభిచారం పెచ్చు పెరిగిపోతోంది. పెళ్ళికాని అమ్మాయిలు, పెళ్ళికాని అబ్బాయిలు, వితంతువులు – అందరు భయంకరంగా పతనమయిపోతున్నారు. గర్భం నిరోధించుకోవటానికి, గర్భాన్ని పోగొట్టుకోటానికి మంచి సావకాశం చిక్కింది, గనక కన్యలు, వితంతువులు కూడా గర్భవతులైపోతున్నారు. ప్రజల్లో సత్ప్రవర్తన, సదాచారం, శీలం, లజ్జ మొదలైనవన్నీ క్షీణించిపోతున్నాయి.

ఈ రీతిలో ఇలా కుటుంబనియంత్రణ పద్ధతుల ప్రచారం కొనసాగుతూంటే సమాజంలో విస్తృతంగా వ్యభిచారం వ్యాప్తి చెందుతుంది. హద్దూపద్దూగాని, భయంగాని ఉండదు. ఇంకా ధర్మబద్ధమైన సంస్కారాల స్రవంతి నడుస్తోంది గనక ఈ పతనావస్థ అంతగా కనబడటం లేదుగాని ఈ స్రవంతి మాత్రం ఎంతకాలం ఉంటుంది? (నడుస్తుంది?) తోపుడు బండిని ఢీకొనటంవల్ల కొంతదూరంవరకూ తనంతతాను ముందుకు వెళుతున్నట్లుంటుంది. కాని ఎక్కడో ఓచోట అది ఆగిపోకమానదు. ఇలాగే ధార్మికసంస్కారాల ఎంత కూడా ఆగిపోతే స్త్రీపురుషుల్లో ఇక హద్దూ పద్దూ ఉండదు. తల్లెవరో, తండ్రెవరో కూడా తెలీదు. ఇలాంటిస్థితి ఇప్పుడు ఇతర దేశాల్లో వినిపిస్తుంది. వ్యభిచారం వ్యాప్తిచెందిన దేశస్థితి ఏమవుతుందో, ఎంతటి అనర్థం వాటిల్లనున్నదో ఊహించనలవికాదు. పశువులకి మనుషులకి ఏమీ తేడాలేని పరిస్థితి ఏర్పడుతుంది.

కుటుంబనియంత్రణ పునాదిలో కేవలం సుఖభోగాల వాంఛ దాగి ఉంది. మన సుఖభోగాలకు అడ్డంకి కాబట్టే సంతానం మనకి నచ్చటం లేదు. అలాంటి స్థితిలో మన తల్లిదండ్రులు, సోదరీసోదరులు ఎలానచ్చుతారు? దొంగ ఒక దొంగతనానికి వెళ్ళినప్పుడు రెండోవ్యక్తి ఎవరైనా తారసబడటం అతనికి నచ్చదు. వ్యభిచారియైన వ్యక్తికి ఎవరైనాస్త్రీ దొరికితే దగ్గరలో మరో మనిషెవరూ ఉండకూడదనే కోరుకుంటాడు. ఇలా మనుషుల్లో,

సుఖభోగవాంఛ విస్తరిల్లితే వారికి ఇతరుల పొడగిట్టదు సరిగదా! త్యాగమూర్తులైన మహాత్ములు, సత్పురుషులు కూడా గిట్టరు ఉత్తమ గురువులు సంయములు, మర్యాదస్థులు, ధర్మప్రబోధకులు అసలే గిట్టరు. ఎందుకంటే వాళ్ళు సుఖభోగాలను, వ్యభిచారమును వ్యతిరేకిస్తూంటారు గదా! విలాసపురుషులు తమసుఖభోగాలకు బాధకులుగా వాళ్ళని తలంచి వాళ్ళని కొట్టటానికి, చంపటానికి కూడా సంసిద్ధులౌతారు. చదువుకొనే వాళ్ళకి చదువుసంధ్యల్లో నిర్బంధం (పరాధీనత) ఉంటుంది. వాళ్ళ స్వేచ్ఛకి బాధకలుగుతూ ఉంటుంది. అలాంటి పిల్లలు సభపెట్టుకొని తీర్మానాలు చెయ్యాల్సివస్తే - "స్కూళ్ళు బంధిఖానాలు, వాటిని మూసెయ్యండి" అవి మన స్వాతంత్ర్యానికి అడ్డంకులను కల్పిస్తున్నాయి. అంటూ తీర్మానాలు చేస్తారు. అలాగే విలాసపురుషులు కూడా "తప్పును సరిదిద్దకండి! తప్పును గురించి చెప్పేవాళ్ళను (ప్రబోధించేవాళ్ళను) సరిదిద్దండి!" అంటూ తీర్మానాలు చేస్తారు."

2. హింసాభివృద్ధి :- దేశంలో హింస పెచ్చరిల్లి పోతుంది. ఇప్పటివరకూ అందిన సమాచారం ప్రకారం మూడువేల ఆరువందల వధ్యశాలలు దేశంలో నెలకొని ఉన్నాయి. వీటిలో పదివరకూ యంత్రాలద్వారా నడిచే వధ్యశాలలున్నాయి. ఈ వధ్యశాలలలో సుమారు రెండున్నర లక్షల పశువులు ప్రతిరోజూ వధింపబడుతున్నాయి. ఈ పశువుల్లో ప్రతిరోజూ సుమారు 50 వేల గోవులు చంపబడుతున్నాయి. ప్రతిసంవత్సరం వేలకొలది టన్నుల మాంసం ఎగుమతి చేయబడుతోంది. వీటితోపాటు విభిన్నరంగాల్లో హింస పెచ్చుపెరిగిపోతుంది. నరహత్యలు (మనుషులను చంపడం) కూడా పెరిగి పోతున్నాయి. పంటపొలాల్లో విషపూరితమైన మందులు చల్లడంతో నిరుపయోగంగా భావించే జీవులతోపాటు ప్రయోజనకరమైన జీవులుకూడా మరణిస్తున్నాయి. వాస్తవదృష్టితో చూస్తే భగవంతుని దృష్టిలో ఏ జీవీ నిరుపయోగమైనది కాదు. కాని లోభంచేత కళ్ళు మూసుకుపోయిన మానవ జాతికి ఇతరజీవులవలన ప్రయోజనం కానరావడంలేదు.

దేశంలో నేడు పెచ్చుపెరిగిపోతున్న హింస ఇలాగే పెరుగుతూ

పోతే ఒకనాటికి పశుసంపద మొత్తం నాశనమయిపోతుంది చివరికి మాంసాహారులైన మానవులు మనుష్యులనే భక్షించటం మొదలుపెడతారు. అలాంటి మానవులే దానవులవుతారు. రాక్షసులు మనుష్యుల్ని భక్షించి వాళ్ళ ఎముకల్ని గుట్టలుగా రాశిపోసిన సంఘటన రామాయణ కాలంలో సంభవించింది.

అస్థి సమూహా దేఖి రఘురాయా ।
పూఛీ మునిన్హ లాగి అతి దాయా ॥
జానతహూఁ పూఛిఅ కస స్వామీ ।
సబదరసీ తుమ్హ అంతర జామీ ॥
నిసిచర్ నికర్ సకల ముని ఖాఏ ।
సుని రఘుబీర్ నయన జల ఛాఏ ॥
(మానస. అరణ్య. 9/3–4)

దయాళువు అగు శ్రీరఘురాముడు ఎముకలసమూహమును చూచి మునులతో నడిగెను. వారు "స్వామీ! మీరు సర్వజ్ఞులు, అంతర్యామి, ఐననూ అడుగుచున్నారు నిశాచరసమూహము మునులను భక్షించగా మిగిలిన వారి ఎముకలే యివన్నీ" ఈ మాటలు వినగానే రఘువీరుని నేత్రములు అతి దయతో సజలములాయెను.

3. చౌర్యాభివృద్ధి :– దేశంలో దొంగతనం మితిమీరిపోతుంది. ప్రభుత్వం అధికంగా పన్నులు విధిస్తోంది. తదనుగుణంగా ప్రభుత్వం కూడా చట్టాలు రూపొందిస్తుంటే ఆ చట్టాలనుండి తప్పించుకోటానికి ప్రజలూ దొంగతనానికి పాల్పడ్డట్టు రకరకాల దారులు వెతుకుతున్నారు. న్యాయవాదులు కూడా పన్నుల దొంగతనానికి సంబంధించిన ఉపాయాలే చెబుతున్నారు. ఈ విధముగా అటు ప్రభుత్వం, ఇటు ప్రజలూ ఇద్దరిలోనూ అనైతికత, అధర్మం, అన్యాయం పెరిగిపోతున్నాయి.

ఇప్పుడు జరుగుతున్న రీతిలో ఇదే విధముగా చౌర్యం పెచ్చు పెరుగుతూ పోతుంటే సమాజంలో దోపిడీలు మొదలవుతాయి. పెద్దచేప

చిన్నచేపను మింగేసినట్లుగా బలవంతులు బలహీనుల్ని లూటీచేయడం మొదలుపెడతారు. దొంగలు, దోపిడీదారుల సంఖ్య పెరిగిపోవడంవలన వారి ఓట్ల సంఖ్య కూడా పెరిగిపోతుంది. దానివల్ల అలాంటి వాళ్ళ చేతుల్లోనే రాజ్యం నడుస్తుంది. ఇప్పటికీ ఒకానొక స్థితి కనిపిస్తుంది. అద్దెకున్నవాడు ఆ అద్దె యింటి యజమానై కూర్చోవడం, పొలందున్నేవాడు పొలం యజమానిగా స్థిరపడిపోవటం వంటి పరిస్థితులు నెలకొంటున్నాయి. పూర్వం అశ్వపతి మహారాజు ఒకసారి ఇలా పేర్కొన్నాడు :–

న మే స్తేనో జనపదే న కదర్యో న మద్యపః ।
నానాహితాగ్నిర్నావిద్వాన్ న స్వైరీ స్వైరిణీ కుతః ॥
(ఛాందోగ్య. 5/11/5)

"నా రాజ్యంలో చోరుడు లేడు. కృపణుడు లేడు. తాగుబోతులేడు, అగ్నిహోత్రం చెయ్యనివాడు లేడు. అపండితుడు లేడు. పరదారాభిగమనం చేసేవాడూ లేడు. మరలాంటప్పుడు కులట (వేశ్య) అయిన స్త్రీ ఎలా ఉంటుంది?

కాని ఇప్పుడు దీనికి వ్యతిరేకమైన విపరీతపరిస్థితి నెలకొని ఉంది. అంటే చోరులు, కృపణులు, తాగుబోతులు, అగ్నిహోత్రం వేల్చనివారు అపండితులు, పరస్త్రీలోలురు, వేశ్యలు – వీరికే ప్రాముఖ్యం లభిస్తోందన్నమాట.

వ్యభిచారం, హింస, చౌర్యం ఈ మూడూ పెచ్చుపెరగటంవలన కలిగే పరిణామం భయంకరంగా ఉంటుంది ఎంత భయంకరంగా ఉంటుందనేది మనం ఊహించి చెప్పలేం కూడా!

శాస్త్రాలు ఇలా ప్రవచించాయి:

**అపూజ్యా యత్ర పూజ్యంతే పూజ్యపూజావ్యతిక్రమః ।**
**త్రీణి తత్ర ప్రజాయంతే దుర్భిక్షం మరణం భయమ్ ॥**
(స్కంద పురాణం. మా.కే. 3/48)

"ఎక్కడ అపూజనీయులైన వారు పూజితులవుతారో,

పూజనీయులైనవారికి నిరాదరణ కలుగుతుందో, అక్కడ దుర్భిక్షం, మరణం, భయం అనే మూడు విషయాలూ తప్పనిసరిగా సంభవిస్తాయి."

ఈ యావద్భూమండలంలో భారతభూమికి విశేష ప్రభావము ఉంది. అది మనకు ప్రత్యక్షంగా కనబడేదికాదు. ఈ గడ్డమీది ఋషి పుంగవులకు అపారమైన శక్తి ఉంది. ఈ దేశం వసుధైకమైన జీవనసరళి కలిగి, పరహితాభిలాషిత్వం నెరపేదేశం. అందుచేత భారతదేశపతనం సమస్త ప్రపంచానికీ పతనమే! – ఇప్పుడు జరుగుతున్నది మన గొప్పదగు భారతదేశంయొక్క ఒకానొక భయంకరమైన మహాసంహారానికి నాంది. ఇంతకంటే సంస్కరణలకు, శాంతికి తగిన మార్గాలు కనబడటం లేదు. ప్రజల్లో భీషణసంహారం జరిగి శక్తిసామర్థ్యాలూ, సిరిసంపదలూ నాశనమయినప్పుడే శాంతి స్థాపన జరుగగలదు.

~~~~oOo~~~~
~~~~

# 2. గృహస్థులకోసం

విజ్ఞప్తి :- ఒకవేళ ఈ వ్యాసం మీ మనసుకు నచ్చకపోయినప్పటికి దయచేసి కనీసం ఒక్కసారైనా హృదయపూర్వకంగా చదవండి.

ప్రభుత్వం జనాభా పెరుగుదలను అరికట్టడానికి నిర్వహిస్తున్న కుటుంబనియంత్రణ కార్యక్రమాల్లో అంతర్భాగంగా గర్భనిరోధం, గర్భస్రావం వంటి మహాపాపాలు చేయటానికి ప్రజల్ని ప్రోత్సహిస్తోంది. దీనికోసం కొత్తకొత్త మార్గాలను అన్వేషిస్తూ వాటిని విస్తృతస్థాయిలో ప్రచారప్రసారాలు చేస్తోంది. ప్రభుత్వం చేసే ఈ కార్యక్రమాలు ఎంతవరకు సముచితమో కొంచెం ఆలోచన చేద్దాం!

## కుటుంబ నియంత్రణ ప్రచార ప్రసారాలకు కారణాలు

కుటుంబనియంత్రణ కార్యక్రమాల ప్రారంభం ప్రప్రథమంగా దైవం, ధర్మం, పరలోకం వంటి విషయాలు అంతగా తెలియని పాశ్చాత్య దేశాల్లో జరిగింది. పెరిగిపోతున్న జనాభాను ఇలా ఉపేక్షిస్తూపోతే, భవిష్యత్తులో కడుపునిండా తిండే ఉండదు. ఉండటానికి కావలసినంత చోటు లభించదు. మన జీవననిర్వహణ కష్టమైపోతుంది. మన జీవనస్థాయి పడిపోతుంది. అని అనుకొంటూ అక్కడి ప్రజలు ఆలోచనచేశారు. వారు జనాభా పెరుగుదలవైపు దృష్టిసారించారేగాని, జనాభా పెరుగుదలతోపాటు జీవననిర్వాహక సాధనాలు (బ్రతుకుతెరువుకు కావలసినవి) కూడా వృద్ధిపొందుతాయని గ్రహించలేదు. అవసరమే ఆవిష్కరణకి మూలం కదా! విజయవంతమైన కుటుంబనియంత్రణ కార్యక్రమాలవల్ల జీవననిర్వాహక సాధనాలలో అభివృద్ధి అయితే జరగలేదుగాని, సమాజం యొక్క

ఘోరపతనానికి కారణభూతమైన అనేక దురాచారాలయొక్క వృద్ధి మాత్రం జరిగింది.

వాస్తవానికి జీవన నిర్వాహక సాధనాల కొరతకి కారణం జనసంఖ్య వృద్ధిమాత్రం కాదు. అసలు కారణం సుఖభోగాలపై లాలసత్వం పెరగటమే! భోగేచ్ఛ పెరిగిపోవడంతో మనుషులు సుఖలాలసులై, సోమరిపోతులై పోతారు. దీనివలన జీవన నిర్వాహక సాధనాలను విస్తృతంగా వినియోగించుకొంటారుగాని, ఉత్పాదన మాత్రం తక్కువగానే చేస్తారు. దీనివల్ల జీవననిర్వాహక సాధనాల్లో కొఱతరావటం మొదలవుతుంది. ఇంతేకాదు తమ కోరికలు తీర్చుకోడానికి మనుషులు రకరకాల పాపాలు చేయడం కూడా ప్రారంభిస్తారు. ఈ పాపాల్లో గర్భపాతం వంటి సంతాననిరోధక మార్గాలు కూడా చేరి ఉన్నాయి. భగవద్గీత కామం అనగా భోగేచ్ఛ సకల పాపాలకు మూలం అని పేర్కొంది.

కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః ।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్ ॥ (3/37)

"రజోగుణంనుంచి ఉత్పన్నమయ్యే కామమే క్రోధం. ఇది మహాతిండిపోతు. మహాపాపి. ఈ విషయంలో నువ్వు దీనిని శత్రువుగా తెలుసుకో". భోగవిలాసవస్తువులను మానవుడు తనకు నిత్యావశ్యకమైన వస్తువులుగా మార్చుకొన్నాడు. మనిషి ఈ వస్తువులకి ఎంతగా బానిస అయ్యాడంటే ఆ వస్తువులు లేనిదే జీవితమే భారంగా గోచరిస్తోంది. దీనికి సోమరితనం, నిర్లక్ష్యం సుఖాపేక్షే కారణాలు. వీటికోసమై తన ప్రయోజనాలు నెరవేర్చుకోవటమే దుర్లభంగా ఉన్నప్పుడు తన సంతానంయొక్క ప్రయోజనాలను ఎంతవరకూ నెరవేర్చుకోగలడు? అందుకే అతడు సంతాననిరోధక మార్గాలను అమలుచేయటం మొదలెట్టాడు. స్త్రీని విలాసవస్తువుగా తయారుచెయ్యటమే ఉత్తమంగా భావించే అంతగా అతనిలో కామవాంఛ ప్రబలింది. అంతేగాని భోగంయొక్క ప్రాకృతిక పరిణామం సంతానాన్ని పొందటమేనన్నది సరియైన పద్ధతిగా అతడు భావించలేదు. స్త్రీ సంతానంలేకుండా వుంటే చాలాకాలంవరకూ యౌవ్వనవతిగా ఉంటుందని అతగాడు ఆలోచన

చేస్తున్నాడేగాని, లక్షవిధాల ప్రయత్నించినా యౌవ్వనం తరువాత వృద్ధాప్యం వస్తుంది. వృద్ధాప్యం తరువాత అనివార్యమైన మృత్యువు కూడా ముంచుకొస్తుందనే ఆలోచన మాత్రం చేయడం లేదు. అతగాడి హృదయంలో అటుదైవం మీద విశ్వాసంలేదు. ఇటు అదృష్టం మీద విశ్వాసం లేదు. పోనీ అతని పురుషార్థం (కర్తవ్యం) మీదనైనా విశ్వాసం ఉంచటం లేదు. విషయమేమిటంటే – అందర్ని పోషించేవాడు పరమాత్ముడు, ప్రతివ్యక్తి తన అదృష్టాన్నిబట్టి అన్నీ పొందుతాడు. నేను నా పురుషార్థంతో సంపాదించగల్గుతున్నాను. నా కుటుంబాన్ని పోషించగల్గుతున్నాను అనే ఈ మాటలమీద మానవుని విశ్వాసం సడలిపోయింది. ఈ కారణాలన్నింటివల్లనే కుటుంబనియంత్రణ ప్రచారం తీవ్రంగా జరిగింది. జరుగుతుంది కూడా!

## కుటుంబనియంత్రణ ఆవశ్యకమా?

జనాభాపెరుగుదలవల్ల సంభవిస్తాయని చెప్పబడే నష్టాలు కేవలం కల్పితాలు. వాటిలో వాస్తవికత ఎంతమాత్రం లేదు. జనసంఖ్య వృద్ధిపొందితే ఆహారధాన్యాల కొఱత ఏర్పడుతుందని, దానివల్ల అందరికీ కడుపునిండా తిండే ఉండదని కుటుంబనియంత్రణ ప్రచారకులు చెబుతున్నారు. అదెప్పుడంటే ఆహారధాన్యాలు ఒక నిశ్చితరాశిలోనే ఉండి ఆ తర్వాత ఆహారధాన్యాలు పండించే వీలులేనప్పుడు అన్వయించి అనుకోవాల్సినమాట. జనాభా పెరుగుదల దృష్ట్యా ఆహారధాన్యాల విషయం ఆలోచించేవాళ్ళు, జనసంఖ్య పెరుగుదలవల్ల కేవలం భుజించే వాళ్ళే పెరగరు. పంటలు పండించే వాళ్లుకూడా (సంపాదించేవాళ్ళు) పెరుగుతారన్న విషయం మరచిపోతున్నారు. ప్రతివ్యక్తిదగ్గర కేవలం పొట్ట మాత్రమే ఉండదు. రెండు చేతులు, రెండు కాళ్ళు, ఇంకా ఒక మెదడు కూడా ఉంటుంది. వీటితో అతడు తనకే కాకుండా చాలా జీవులకు పోషణభారం వహించగలడు. వాస్తవానికి మనుషులు కృషిచేయకుండా భోగలాలసులు, వ్యభిచారులు, సోమరులు అయితే తప్ప ఆహారధాన్యాలవంటి వస్తువులకు కొఱతయే వాటిల్లదు. అవసరమే ఆవిష్కరణకు మూలాధారం. కాబట్టి జనసంఖ్య పెరిగినప్పుడు, వారికి

పోషణావశ్యక ఉపాయాలు కూడా వృద్ధిపొందుతాయి. వారి పంటకూడా వృద్ధిపొందుతుంది. వస్తువుల ఉత్పాదన కూడా వృద్ధిపొందుతుంది. అలాగే పరిశ్రమలు కూడా వృద్ధి పొందుతాయి. వ్యవసాయం చేసేవాళ్ల సంఖ్య తక్కువగా ఉండటంవల్ల ఈ భూమిమీద మొత్తం డెబ్బై శాతం పంటభూమి ఉంటే అందులో పదిశాతం భూభాగంలోనే వ్యవసాయం జరుగుతోంది. కాబట్టి జనసంఖ్య పెరగటంవల్ల ఆహారధాన్యాల కొఱత అనే ప్రశ్న ఉదయించదు. ఒకసారి గడచిన కాలాన్ని పరికించిచూస్తే జనాభా పెరిగిన దానికంటే ఎక్కువే ఆహారధాన్యాల ఉత్పత్తి జరిగిందన్నది బోధపడుతుంది. అందుకే జె.డీ. బర్నేల్ లాంటి నిపుణులు – జనాభా పెరిగినప్పటికి రాగల వంద సంవత్సరాలవరకూ ఆహారధాన్యాల కొఱత ఏర్పడే అవకాశం లేదని పేర్కొన్నారు. ప్రసిద్ధ ఆర్థికవేత్త కోలిన్ క్లార్కు మరోవిషయం కూడా చెప్పాడు. పంటభూమిని సరైన విధంగా ఉపయోగించుకొన్నట్లయితే ప్రస్తుతం ఉన్న జనాభా పదింతలకుపైగా వృద్ధిపొందినప్పటికి, ఏ విధమైన ఆహారసమస్య ఉత్పన్నం కాబోదని ఆయన పేర్కొన్నారు. ("Population Growth and living standard" అనే గ్రంథం)

1880వ సంవత్సరంలో జర్మనీలో జీవనావశ్యక సాధన సంపత్తికి తీవ్ర కొఱత ఉన్నప్పటికి ఆ తరువాత 34 సంవత్సరాల మధ్యన జనాభా విపరీతంగా పెరిగింది. అప్పుడు జీవనావశ్యక సాధన సంపత్తికి కొఱత ఏర్పడలేదు సరికదా! అవి ఇతోధికంగా పెరగటంవల్ల పనిచేయడంకోసం ఇతర ప్రాంతాలనుంచి మనుషుల్ని పిలిపించుకోవాల్సి వచ్చింది. ఇంగ్లాండులో జనసంఖ్య తీవ్రంగా పెరిగినప్పటికి అక్కడ జీవనావశ్యక సాధన సంపత్తిలో ఎట్టి కొఱత ఏర్పడలేదు. ప్రపంచం మొత్తం జనాభా ఎంత పెరిగినా, అంతకంటే ఎక్కువే జీవన నిర్వాహక సాధన సంపత్తి పెరిగిందన్నది ప్రత్యక్షసత్యమే!

జనసంఖ్య పెరిగితే ప్రజలు నివసించటానికి చోటు లభించటమే దుష్కరమై పోతుందని కుటుంబనియంత్రణను సమర్థిస్తూ ఉన్నవారు చెబుతున్నారు. ఆలోచించి చూడండి! ఈ సృష్టియావత్తూ కోట్లాది సంవత్సరాలనుంచీ జరుగుతూ వస్తోంది. అయినప్పటికి జనాభా

పెరిగిపోవడంవల్ల ప్రజలకు భూమిమీద నివసించటానికి చోటు దొరక్కపోవడమనేది ఎవరూ ఎప్పుడూ కూడా చూడలేదు. చదవలేదు. పోనీ విన్నైనా ఉండలేదు. జనసంఖ్యను నియంత్రించటం జీవననిర్వహణకు తగు ఏర్పాట్లు చేయడం మానవుల చేతుల్లో లేదు. అది సృష్టికర్తయైన భగవంతుని చేతుల్లో ఉంది. పరమాత్ముడు ఇలా పేర్కొన్నాడు –

గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా । (గీత. 15/13)

"నేనే భూమిమీద ప్రవేశించి సర్వభూతాల ధారణ, పోషణను జరుపుతున్నాను."

యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః । (గీత. 15/17)

"నాశనములేని ఆ ఈశ్వరుడు మూడులోకాలలోను వ్యాపించి వాటన్నిటినీ భరించి పోషిస్తున్నాడు.

1898 వ సంవత్సరంలో బ్రిటిష్ అసోషియేషన్ అధ్యక్షుడు సర్ విలియమ్ క్రోక్స్ జనాభాపెరుగుదలదృష్ట్యా రానున్న 30 సంవత్సరాలకు మించి జీవనావశ్యక సాధనసంపత్తి మన అవసరాలను తీర్చలేదంటూ ఇప్పుడు మనం అనుకొంటున్నట్లుగానే ఒక హెచ్చరిక చేసి ఉన్నాడు. అలాగే జరిగినట్లయితే ఇంగ్లండు వంటి దేశాల్లో వెంటనే దుర్భిక్షాన్ని ఎదుర్కోవాల్సి వచ్చేది గదా! కాని ఆ తరువాత 30 సంవత్సరాలలో వారు కరువుకాటకాలకు దూరంగానే ఉన్నారు. పంటలు అధికంగా పండాయి. ధరలుకూడా గణనీయంగా పడిపోయాయి. దానివల్ల అమెరికావంటి కొన్ని దేశాల్లో మిగిలిపోయిన గోధుమల్ని తగలబెట్టి లేదా సముద్రంలో పడవైచి నాశనం చెయ్యాల్సిన పరిస్థితి వచ్చింది.

నేడు అనేక ఎకరాల (హెక్టారుల) భూమి ఖాళీగా పడి ఉంది. కాబట్టి జనసంఖ్య పెరుగుదల దృష్ట్యా భవిష్యత్తులో ప్రజలకు "తినడానికి తిండి దొరకదు, ఉండటానికి స్థలం దొరకదు" అంటూ గొడవ చెయ్యడం వ్యర్థం. ప్రస్తుత జనాభా రెండింతలకు మించినా అందరి జీవన నిర్వహణకి సరిపడే ప్రకృతి సంపద భారతదేశంలో ఉంది. భారతీయ ప్రకృతి సంపద ప్రపంచంలో కెల్లా ఎక్కువగానే ఉంది. ఇక్కడ పండే వస్తువులు ఏ ఇతరదేశాల్లోనూ పండవు. జనాభా తగ్గిపోయే పక్షంలో వాటన్నిటి ఉత్పాదన

ఎవరు చేస్తారు? అందువల్ల జనసంఖ్య తగ్గిపోవటంవల్ల ఆహారధాన్యాలను పండించడం నేర్పరులైన వ్యక్తులకు ఉత్పాదన చేసే శక్తులకు ఇంకా ఉత్పాదన చేసే సాధన సామగ్రికి లోటు ఏర్పడుతుంది.

జనాభా పెరుగుదలను ప్రభుత్వం ఒక సమస్యగా భావించినట్లయితే జీవనావశ్యక సాధన సంపత్తిని వృద్ధిచేసుకోవాలి. కొత్తకొత్త సాధనసంపత్తిని కనిపెట్టాలి. ఇదే దానికి తగిన వాస్తవికమైన పరిష్కారమవుతుంది. ఈ దృష్టిలో పరిష్కారాన్ని తమదిగా చేసుకొన్న దేశాల్లో జనాభాపెరుగుదలకంటే కూడా జీవననిర్వాహక సాధన సంపత్తిలో అభివృద్ధి చాలా అధికంగా జరిగింది. వాస్తవానికి జీవననిర్వాహక సాధనసంపత్తి కొఱత జనసంఖ్య వృద్ధితో ముడిపడిలేదు మానవులు సోమరులు, ప్రమత్తులు, భోగలాలసులు, అకర్మణ్యులు అయి, బాధ్యతారహితంగా పనిచేసినప్పుడే జీవన నిర్వాహక సాధన సంపత్తిలో కొఱత ఏర్పడుతుంది. అలాంటి మనుషులు ఖర్చయితే అధికంగా చేస్తారుగాని, పనిమాత్రం అంతంతమాత్రంగానే చేస్తారు. ఇదే దేశాన్ని దరిద్రంగా మార్చే అంశం.

వాస్తవానికి దేశసమస్యల పరిష్కారానికి కుటుంబనియంత్రణ కార్యక్రమాన్ని మననెత్తిన వేసుకోవడం మన పరాజయాన్ని ఒప్పుకోవడమే! మానవుడు తనకు కావలసిన అవసరాలను బట్టి జీవనావశ్యక సాధన సంపత్తిని వృద్ధి చేసుకోకుండా తనని తానే అంతం చేసుకోవడమే ఉత్తమంగా భావించుకొనేంతగా సోమరిపోతుగా, అకర్మణ్యుడుగా మారాడన్నది ఇక్కడ స్పష్టమవుతుంది. ఇది వంటిమీద వస్త్రం సరిగా చాలకపోతే వస్త్రాన్ని తగిన విధంగా సరిచేసుకోకుండా శరీరాన్నే కత్తిరించి చిన్నది చేసుకొన్నట్లుగా ఉంటుంది. వస్త్రం మనిషికోసంగాని, మనిషి వస్త్రంకోసం కాదు గదా! నిజానికి మనుషులు వస్త్రాలకోసమే అయితే మనుషుల్లో మానవత్వమే ఉండదు. ఆర్థిక సలహాదారుల కర్తవ్యం ఆర్థికవ్యవస్థను జనసంఖ్యకనుగుణంగా సరిదిద్దగలమన్నది చెప్పటంగాని జనసంఖ్యను ఆర్థికవ్యవస్థకనుగుణంగా సరిదిద్దాలని చెప్పటం కాదు. ఎంతటి ఆర్థిక శాస్త్రవేత్తకయినా, అలాగే ఎంత శక్తిమంతమైన ప్రభుత్వానికైనా సంతానాన్ని తక్కువగా కనండని, లేదా కనకుండా

ఉండండని చెప్పే అధికారం లేదు. మాకుటుంబ జీవన నిర్వాహణ సంబంధమైన అవసరాలను తీర్చేలా ఆర్థిక వ్యవస్థను పటిష్ఠం చేయండని ఆర్థికవేత్తలను, ప్రభుత్వాన్ని అభ్యర్థించే అధికారం ప్రతి తల్లిదండ్రులకి తప్పనిసరిగా ఉండాలి.

ఒక మగవాడు స్త్రీతో సంయోగం జరిపే సమయంలో వెలువడే వీర్యంతో కోట్లకొలది పిల్లలు పుట్టగలరు. దీనికి కారణం మగవాడి వీర్యంలో సుమారు 25 కోట్లనుండి 50 కోట్ల వరకూ శుక్రకణాలుంటాయి. వీటిలో ప్రతి శుక్రకణానికీ జీవోత్పత్తి చేసే సంపూర్ణసామర్థ్యం ఉంటుంది. ఏదో ఒకటే శుక్రకణం స్త్రీ అండంలో (రజస్సు) కలిసి జీవం ఏర్పడుతుంది. మానవుని ఈ సంతానోత్పత్తి శక్తికి ఏదేశప్రభుత్వంగాని, స్వయంగా మానవుడేగాని పరిమితిని నిర్దేశించలేరు. మరెవరు నిర్దేశించారు? ఈ సకలచరాచరజగత్తుకు ఎవడుసృష్టికర్త, పాలనకర్త సంహారకర్త అయివున్నాడో అతడు దీనికి పరిమితి నిర్దేశించాడు. * జనాభాను పెంచడం లేదా తగ్గించడం అనే నియంత్రణ కార్యక్రమం భగవంతుడు నిర్వహించే శాఖలో (ప్రణాళికలో) ఉందిగాని, ప్రభుత్వశాఖలో లేదు. ఇక్కడ గ్రహించాల్సిన విషయమేమంటే ప్రభుత్వానికి జనసంఖ్యనుబట్టి వారివారి జీవన నిర్వహణకు భద్రతకు తగిన (చక్కటి) ఏర్పాట్లు చేయడంగాని, ఆ జనసంఖ్యకు పరిమితులు (హద్దులు) విధించటంకాదు. జనసంఖ్యకు జీవన నిర్వహణ సాధనసంపత్తికి మధ్య సమతుల్యం సాధించే ప్రయత్నం చేస్తే ఆ సమతుల్యం సరిగ్గా ఉండదు సరిగదా! మరింత చెడుతుంది. ఎందుకంటే జీవననిర్వాహక సాధనసంపత్తి మనుషులకోసంగాని, మనుషులు ఆ సాధనసంపత్తి కోసంకాదు గదా! మనుషుల్ని తగ్గించి ఆహారధాన్యాలను

---

* భగవద్గీతలో కృష్ణభగవానుడు ఇలా పేర్కొన్నాడు:

"ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ" (7/11)

మనుష్యులలో ధర్మవిరుద్ధం కాని అనగా ధర్మయుక్తమైన కామాన్ని నేనే.

"ప్రజనశ్చాస్మి కన్దర్పః" (10/28)

సంతానోత్పత్తికి కారణమైన మన్మథుణ్ణి నేనే.

అధికంగా పండించడమంటే అది సంతానోత్పత్తి జరకుండా చేసి తల్లికి ఇతోధికంగా క్షీరవృద్ధి కలుగజేయడం లాంటిది. వృక్షసంపద అధికంగా ఉన్నచోట వర్షాలు అధికంగా ఉంటాయి. మరి అలాంటప్పుడు మనుషులు అధికంగా ఉంటే ఆహారధాన్యాలు అధికంగా ఉండవా? దేశంలో కుటుంబనియంత్రణ కార్యక్రమాలు ఆరంభం కానిరోజుల్లో ఆహారధాన్యాలు చౌకగా ఉన్నంతగా ఇప్పుడేల లేవు? ఈ విషయం మనం ప్రత్యక్షంగా చూస్తున్నదే.

ప్రభుత్వం జనాభాని నియంత్రించదలచే పక్షంలో, "పుట్టుక"మీద నియంత్రణ అమలుచేయడంతోపాటు 'మృత్యువు' ను కూడా అదుపు చేయాల్సి ఉంటుంది. మరిమృత్యువును అదుపుచేయలేనప్పుడు ప్రభుత్వానికి పుట్టుకను కూడా అదుపుచేసే అధికారంలేదు. మనుషులు పుట్టడం తగ్గి పోయిందనుకొందాం. కాని మృత్యువు మునపటిలాగే తనపని తాను చేసుకుపోతోంటే పరిణామమేమవుతుంది? యుద్ధాలవల్ల కరువు కాటకాలవల్ల, వరదలవల్ల, భూకంపాలవల్ల, కలరావంటి అంటువ్యాధులవల్ల సంభవించే మృత్యువుకు అంతే లేదు. అందువల్ల ఫలానా హద్దువరకూ జనసంఖ్యను తగ్గించాలి అంతేకాదు ఆ హద్దుకంటే జనాభా తగ్గకుండా చూడాలి. ఒకవేళ ఆ అవధికంటే కూడా తగ్గిన పక్షంలో దానిని తిరిగి వృద్ధిచెయ్యాలి అనే దృష్టితో ప్రభుత్వం కుటుంబనియంత్రణ పథకం ద్వారా జనసంఖ్యయొక్క అవధిని నిశ్చయించ లేక పోతుంది. అనగా జనసంఖ్యకు సంబంధించిన వ్యవస్థనుంచి సరైన వ్యవస్థ నడుస్తూ వస్తోంది. ఈ విషయంలో మానవులకు జోక్యం చేసుకొనే అధికారం లేదు. దీనిని గురించి ఈ పాటికే జోక్యం చేసుకొన్న దేశాలు దీనితాలూకు దుష్పరిణామాల్ని అనుభవించే ఉన్నాయి. సంతాన నిరోధకకార్యక్రమం నాస్తికవాదరూపంలో ఉన్న విషవృక్షపు పంట. నాస్తికులు, సోమరిపోతులు, నిర్లక్ష్యస్వభావం కలవారు, భోగలాలసులు అయినవాళ్ళు ఈ సంతాన నిరోధక కార్యక్రమాన్ని ప్రారంభించారు. వాళ్ళే సంతాన నిరోధక కార్యక్రమాలను సమర్థిస్తూ చేసే వాదాలవల్ల ప్రభావితులౌతారు. ఇంకా చెప్పాలంటే వాళ్ళే ఈ దుష్పరిణామాన్ని కూడా అనుభవిస్తారు.

# కుటుంబనియంత్రణ కార్యక్రమాలవల్ల కలిగే దుష్పరిణామాలు.

ఇంగ్లండు, అమెరికా, జర్మనీ, ఫ్రాన్సు మొదలైన దేశాల్లో గత వందసంవత్సరాలుగా స్వీకరించబడిన కుటుంబనియంత్రణ కార్యక్రమాలకు సంబంధించిన పరిణామాలను విశ్లేషిస్తూ అమెరికాకు చెందిన జనాభా నిపుణుడు ప్రో. వారెనథామ్సన్, "సంతాననిరోధాన్ని స్వీకరించిన సమాజంలో శారీరకంగా యోగ్యులైన, శారీరక దార్ఢ్యం ఉన్న వాళ్ల సంఖ్య అయితే వృద్ధిపొందుతుంది గాని, బుద్ధికుశలతగల ప్రజలసంఖ్యమాత్రం తగ్గిపోతుందని పేర్కొన్నాడు". ఇదే విషయం పేర్కొంటూ కుటుంబనియంత్రణ కార్యక్రమాల ఫలితంగా ప్రజల ఆరోగ్యం, బుద్ధికి సంబంధించిన స్థాయి దిగజారిపోతుందని తెలివితక్కువ వాళ్ళు, అసమర్థుల సంఖ్య పెరుగుతుందని మరో విదేశీ విద్వాంసుడు ఆల్డస్ హక్సలే, బెర్ట్రాండ్ రస్సెల్ మొదలైన వాళ్ళు అన్నారు. దీనికి కారణం పెళ్ళయిన కొత్తలో స్త్రీకి పురుషునియెడల, పురుషునికి స్త్రీయెడల విశేషమైన ఆకర్షణ కలిగి దానివల్ల బలమైన భోగేచ్ఛ ఉంటుంది. ఇందువల్ల ప్రారంభంలో కలిగే సంతానం కేవలం భోగేచ్ఛద్వారానే పుడతారు. ఇలా భోగేచ్ఛవల్ల కలిగే సంతానం ఉత్తమంగా ఉండదు. పైగా తరువాత కలిగే సంతానంకంటే తెలివితక్కువవాళ్ళు, వివేకహీనులు, భోగలాలసులు అవుతారు. కాబట్టి భోగేచ్ఛ లేని యోగుల వంశంలోనే ధీమంతులైన యోగసాధకులు జన్మిస్తారు. "యోగినామేవ కులే భవతి ధీమతామ్" అని భగవద్గీత పేర్కొంది. (6/42)

కుటుంబనియంత్రణ కార్యక్రమం అమలుపరచే సమాజంలో శిశువులు, యువకులసంఖ్య తగ్గిపోతుంది. వృద్ధులసంఖ్య వృద్ధిపొందుతుంది. దీని కారణంగా దేశ ఆర్థికాభివృద్ధి కుంటుపడుతుంది. ఇంకా అనేక దృష్టికోణాలలో బాగా వెనకబడటం జరుగుతుంది. పిల్లలు, వృద్ధుల నిష్పత్తి చెడిపోవటంవల్ల వ్యవస్థమొత్తం డొల్ల అయిపోతుంది. లార్డ్‌కీన్స్, ప్రో. హెన్సన్‌ల అభిప్రాయం ప్రకారం, "జనసంఖ్య వృద్ధివల్ల ఆర్థికసంబంధమైన వేగం పుంజుకొంటుంది. నిరుద్యోగం పెరగటానికి

జనసంఖ్య తక్కువకావడమే కారణం. జనసంఖ్య పెరిగే పక్షంలో మార్కెట్టు పరిస్థితి పెరిగితే ప్రతివ్యక్తి ఉత్పాదన పెరుగుతుందేగాని తగ్గిపోదని" కోలన్ క్లార్క్ రాశాడు. "అమెరికాలో ప్రస్తుతం ఉన్న చాలాపరిశ్రమలు సంక్షోభంలో పడిపోతాయి పైగా వాటి ఉత్పాదన వ్యయంకూడా విశేషంగా పెరిగిపోతుంది".

సంతాననిరోధక పద్ధతుల విస్తృతప్రచార, ప్రసారాలవల్ల భోగేచ్ఛ బాగా పెరిగిపోతుంది. ఈ భోగేచ్ఛ పెరిగిపోవడంవల్ల ఆ పద్ధతులను అమలుచేయటం వివాహితులైన స్త్రీపురుషులకే పరిమితమై యుండదు సరిగదా! వాటిని అవివాహితులైన బాలబాలికలు కూడా అమలు చేయడం ప్రారంభిస్తారు. దీనివల్ల సమాజంలో వ్యభిచారం పెచ్చుపెరగడమే కాకుండా సామాజికంగా ఏర్పడి ఉన్న కట్టుబాట్లకు భంగం వాటిల్లుతుంది. ఈ కట్టుబాట్లు నశించినపుడు మనుషులు పశువుల్లా తయారవుతారు. గర్భాన్ని నిరోధించుకోటానికి, గర్భం పోగొట్టుకోడానికి ఉపాయాలు లభిస్తున్న కారణంగా ఇక కన్యలు, వితంతువులు గర్భవతులవటం మొదలుపెడతారు. వ్యభిచారం వృద్ధిచెందటంవల్ల కొరుకుడు మొదలగు గుప్తరోగాలు, ఎయిడ్స్ వంటి భయంకరవ్యాధులు ప్రబలుతాయి. ప్రజలు శీలభ్రష్టులై పోవడంతో దేశానికి ఘోరనైతిక పతనం సంభవిస్తుంది. కుటుంబనియంత్రణ కార్యక్రమాలకు సంబంధించిన ఈ దుష్పరిణామం పాశ్చాత్యదేశాల్లో ప్రత్యక్షంగా దర్శనమిస్తుంది. అక్కడ లైంగిక నేరాలు పెచ్చుపెరిగాయి. ఇరవై సంవత్సరాల వయసుకన్న తక్కువ వయస్సుగల వారలలో గనేరియా, కొరుకుడు రోగం మొదలైన గుప్తరోగాలు వేగంగా వ్యాప్తి చెందుతున్నాయి.

విదేశాల్లో భార్యాభర్తల సంబంధాల్లో ఏర్పడుతున్న శైథిల్యానికి, విస్తృతస్థాయిలో విడాకులు పుచ్చుకోడాలు పెచ్చుపెరిగిపోవడానికి సంతాననిరోధం కూడా ఒక కారణం. సంతానం తక్కువగా ఉన్నవాళ్ళు, సంతానం లేని భార్యాభర్తలే ఎక్కువగా విడాకులు తీసుకొంటున్నారు. సంతానం కలగటంవల్ల భార్యాభర్తలసంబంధాలు పటిష్ఠమవుతాయి. తల్లిదండ్రుల రూపంగా వారు ఒక ఉత్తమ (శ్రేష్ఠమైన) పదవిని పొందుతారు.

కాని సంతాన నిరోధంవల్ల భార్యాభర్తల సంబంధాలు శిథిలమై కేవలం కామవాంఛలు తీర్చుకోడానికే పరిమితమవుతాయి. స్త్రీకి "అమ్మ" అనే ఉన్నతమైన హోదా లభించదు. పైగా ఆమె విలాసవస్తువుగా తయారవుతుంది. ఇది ఆమె పతనానికి సంకేతం. భార్యాభర్తల సంబంధాల్లో శైథిల్యం ఏర్పడినప్పుడు సమాజంలో విడాకులు, వ్యభిచారం వంటి దురాచారాలు పెచ్చుపెరిగిపోతాయి. వీటి పరిణామం బహుదుఃఖదాయకమవుతుంది.

స్త్రీకి తల్లి కావడంవల్ల గౌరవం లభిస్తుందేగాని విలాస వస్తువుగా తయారుకావడంవల్ల లభించదు. విలాసవతిగా తయారయిన కొంతకాలం గడిచాక భోగ్యవస్తువుగా యోగ్యరాలు కాలేనవుడు ఆమె జీవననిర్వహణ ఎవరు చూస్తారు? పైగా ఆమె నిరాదరింపబడుతుంది. భర్త విడాకులు ఇచ్చివేస్తాడు పిల్లలు ఉన్నా లేకున్నా అప్పుడామెను ఎవరు చూస్తారు? సంతానం లేకపోతే వృద్ధురాలు, వ్యాధిగ్రస్తురాలు అయిన వనితకు కావలసిన సేవలు ఎవరందిస్తారు? ఎందుకంటే తల్లి ఏమాత్రం కష్టపడకూడదు. ఆమెకు సేవలు జరిగితీరాలి. అనే భావం సొంతపిల్లల్లో ఉన్నట్లుగా ఇతరులలో ఉండదు గదా!

పిల్లలు తక్కువగా పుడితే మనం సుఖపడతాం మనజీవనస్థాయి బాగుంటుంది అనే ఈ స్వార్థభావం మనుషుల బుద్ధిలో ఉదయించినప్పుడు ఆ భావం పిల్లల్ని తక్కువగా కనాలి, లేదా అసలే కనకూడదు అనే పరిమితి దగ్గర ఆగదు. వారి స్వార్థ ప్రయోజనాలు నెరవేర్చుకోడానికి తమ సంతానమొక్కటే బాధకంగా అనిపించదు, పైపెచ్చు ఇతరులు, వృద్ధమాతాపితరులు కూడా బాధకంగానే కనిపిస్తారు. కుటుంబానికి చెందిన రోగులు, వికలాంగులు, అసమర్థులు, నిర్ధనులు అయిన వ్యక్తులు కూడా బాధకులుగా కనిపిస్తారు. పాశ్చాత్యదేశాల్లో ఇలాంటిస్థితి కనిపిస్తోంది. తనసంతానాన్నే సరిగా పోషించటానికి సిద్ధంగా లేనివాడు ఇతరుల పోషణ ఎలా చేస్తాడు? అందువల్లే సంతాననిరోధక ప్రచార ప్రసారాలవల్ల మనుషుల్లో సేవ, త్యాగం, ప్రేమ, పరోపకారం వంటి భావాలు నష్టమైపోతాయి. వాళ్ళు మునుపటికంటే ఇంకా స్వార్థపరులైపోతారు.

ప్రతివ్యక్తి కేవలం తనకుటుంబం మరియు తన వ్యక్తిగత పరిస్థితులు చూసి తన స్వార్థము కొరకే సంతాననిరోధము చేస్తున్నాడు. కాని దేశపరిస్థితులు గమనించి సంతానాన్ని నిరోధించుకోవడంలేదు. దేశం స్వయం సమృద్ధంకావడానికి కనీసం ఎంత జనాభా ఆవశ్యకం అన్న విషయం మనిషి దృష్టిలో లేదు. కేవలం ఒకళ్ళిద్దరు సంతానాన్నే కన్న స్త్రీపురుషులు మన సంతానం మనదగ్గరే ఉండి మనకు సేవలు చెయ్యాలి, మన స్వార్థప్రయోజనాలు నెరవేర్చాలి. మన అవసరాలు తీర్చాలి. అని ఆశపడతారు. అదే అధికసంతానం ఉన్న తల్లిదండ్రులైతే మన సంతానం దేశానికి సేవచెయ్యాలి, సైన్యంలో చేరి దేశాన్ని శత్రువులనుంచి రక్షించాలి అనే ఆలోచన వారి మనస్సులో రావచ్చును. ఒకళ్ళిద్దరే సంతానం ఉన్నపక్షంలో ఇంటిపనే పూర్తికాదు. మరి సైన్యంలో ఎవరు చేరతారు? ఎవరు సత్పురుషులవుతారు? ఎవరు శాస్త్రవిషయాల్లో పండితులవుతారు? వ్యాఖ్యాతలవుతారు? అదే అధికసంతానం ఉంటే ఒకళ్ళు సైన్యంలోకి వెళతారు, మరొకళ్ళు వ్యవసాయం చేస్తారు, ఇంకొకళ్ళు వ్యాపారం చేస్తారు. ఫ్యాక్టరీలు ప్రారంభిస్తారు. జనసంఖ్య పెరగటంవల్ల ప్రజలు ఆకలితో చచ్చిపోతారని కుటుంబనియంత్రణను సమర్థించేవాళ్ళు అంటున్నారు. వ్యవసాయం చెయ్యటానికి ఇప్పుడే మనుషులు తగ్గిపోతుంటే మరి రాబోయే కాలంలో జనసంఖ్య మరింత తగ్గిపోగా వ్యవసాయానికి మనుషులెట్లా దొరుకుతారు? అందుకే మేము చెప్పదలచుకొన్న దేమిటంటే జనసంఖ్య తగ్గిపోవడంవల్లనే ప్రజలు ఆకలితో చచ్చిపోతారు. ఒకవేళ పనిచేసేవాళ్ళు దొరికినా, దొరికినవాళ్ళు డబ్బులైతే పుచ్చుకొంటారు గాని మనసులగ్నంచేసి కష్టించి పనిచెయ్యరు. ఇది మనం ప్రత్యక్షంగా చూస్తున్న సంగతి. ఇంట్లో మనుషులు (కొడుకులు వగైరా) శ్రమించి పనిచేసినంతగా సేవాతత్పరతతో కూలివాళ్ళు, నౌకర్లూ పనిచెయ్యరు. విదేశీ నిపుణుల అంచనాలప్రకారం ఇద్దరిద్దరు సంతానం ఉన్న వాళ్లను ఓ వెయ్యిమందిని తీసుకొంటే తర్వాత వారి సంఖ్య 331కి తగ్గిపోతుంది. 60 సంవత్సరాల తర్వాత వాళ్ళ సంఖ్య మరింత తగ్గిపోయి 186 అవుతుంది. 150 సంవత్సరాల తర్వాత వాళ్లసంఖ్య కేవలం 92గా మిగిలిపోతుంది. ఇలా జనసంఖ్య అధికంగా తగ్గిపోతే ప్రజలు కరువుకాటకాలు, వరదలు, భూకంపాలు మొదలైన ప్రకృతి సంబంధ

బీభత్సాలనుండి, శత్రువులనుండి తమనితాము రక్షించుకోలేరు. ఫలితంగా ప్రజలు తమ అస్తిత్వాన్నే కోల్పోతారు. కనుక కుటుంబనియంత్రణ పథకాన్ని చేపట్టిన జాతి నిజానికి ఆత్మహత్య చేసుకొన్నట్లే అవుతుంది.

జపానుమీద అమెరికా విసరిన ఆటంబాంబు 20వేల టి.యన్.టిల శక్తిమంతమైనది. దానివల్ల 78,150 మంది వ్యక్తులు మరణించారు 37,425 మంది వ్యక్తులు గాయపడ్డారు. ఇంకా 13,083 మంది వ్యక్తులు జాడ తెలియకుండా పోయారు. కాని ఇప్పుడు పదికోట్ల టి.యన్.టి లేదా అంతకంటె ఎక్కువ శక్తిమంతమైన ఆటంబాంబులు తయారు చేయబడుతున్నాయి. భవిష్యత్తులో ఇలాంటి వినాశకరమైన అణ్వస్త్రాలతో యుద్ధాలు జరిగితే యుద్ధాలకు దిగిన దేశాల జనసంఖ్య హఠాత్తుగా ఎంతగా తగ్గిపోతుందో ఊహించనైనా ఊహించలేము. జనన సంఖ్యను ఇప్పటికే తగ్గించుకోమంటూ వస్తున్న దేశాలకు ఇలాంటి యుద్ధాల్లో అన్నివిధాల వినాశనము నిశ్చయము అవుతుంది.

సుమారు రెండువేల సంవత్సరాలకు పూర్వం ప్రాచీన గ్రీసుదేశంలో గర్భపాతం మొదలైనవి విస్తృతంగా వ్యాప్తిచెంది ఉండేవి. ఫలితంగా ఆ దేశం జనాభాకూడా తగ్గిపోతూ ఉండేది. ఆ సమయంలో అక్కడ గృహయుద్ధాలు చెలరేగాయి. ఇలా జరిగిన రెండింతలనష్టాన్ని గ్రీసుదేశం భరించలేకపోయింది. ఫలితంగా ఆ దేశం పరాయిదేశాలకు బానిసగా పడి ఉండాల్సివచ్చింది. ఒకప్పుడు ఫ్రాన్సుదేశం ప్రపంచముయొక్క ప్రధాన శక్తులలో ఒకటిగా లెక్కించబడుతూ ఉండేది. కాని ప్రపంచయుద్ధంలో ఫ్రాన్సుదేశం పరాజయం పొందినప్పుడు "ఈ దేశ పరాజయానికి మూలకారణం మన జనసంఖ్య తగ్గి పోవడమేనని" మార్షల్ పీతా స్పష్టమైన మాటలలో అంగీకరించారు.

రాజకీయ దృష్టితో చూచినప్పుడు జనాభాపెరుగుదలకు చాలా మహిమ ఉన్నది. జనాభాతగ్గుదల కాలక్రమేణా రాజకీయశక్తుల క్షీణతకు కారణభూతమౌతుంది. "యూరప్ ప్రపంచంలో కెల్లా గొప్పశక్తిగా తయారుకావటంలో జనాభా పెరుగుదలయొక్క పాత్ర ఉన్నదని" ప్రఖ్యాసర

ఓర్‌గాంస్కీ ఆల్‌బ్రెనో అనే ఆయన పేర్కొన్నాడు (Population and Politics) పాశ్చాత్యదేశాల్లో జనసంఖ్య తగ్గుదలతోపాటు రాజకీయశక్తులు కూడా క్షీణించాయి. వీటి సమాచారం ప్రపంచయుద్ధం తర్వాత తెలిసింది. అందువల్లే ఆ దేశాలు జనాభాను వృద్ధిపొందించటంపట్ల తమ శక్తిని కేంద్రీకరించటం మొదలు పెట్టాయి. ఇంతేకాదు తమ పూర్వశక్తిని పునరుద్ధరించుకోటానికి పశ్చిమదేశాలవారు కుటుంబనియంత్రణ ద్వారా జనసంఖ్యను తగ్గించుకోండని తూర్పుదేశాలపై వత్తిడి తీసుకొస్తున్నారు "అభివృద్ధిచెందుతున్న దేశాలయొక్క జనాభా వృద్ధిపొందితే అది తమ ఉన్నత జీవనస్థాయికి రాజకీయభద్రతకు ప్రమాదకారి కాగలదని భావిస్తున్నారు. కాబట్టే అభివృద్ధిచెందుతోన్న దేశాల జనసంఖ్య తగ్గాలని అభివృద్ధిచెందిన దేశాలు కోరుకొంటున్నాయి. ఈ విషయాన్ని ఆర్థర్ మె కారమేక్ (Arthur Me Carmac) స్పష్టమైన పదజాలంతో వివరించాడు. వాళ్ల ఉద్దేశ్యం ముఖ్యంగా నల్ల జాతీయులపై, తెల్లజాతీయుల ఆధిపత్యం చెలాయించినట్లు వెనకబడిన దేశాలపై ఆధిపత్యం చెలాయించి వాళ్ళను ఇంకా వెనకబడేటట్లు చేయడమే! (Analysis Of Life In Society) ఈ కారణంగానే విశ్వ బ్యాంక్ ఇంక పాశ్చాత్య దేశాలు జనాభాను ఇంకా తగ్గించుకోవాలనే షరతుమీదనే భారతదేశానికి ఋణాలు ఇస్తున్నాయి భారతదేశపు జనాభా బాగా తగ్గిపోయి అది ఋణగ్రస్తమైపోతే ఆ దేశాలు మనదేశంపై అధికారం చెలాయించ వచ్చునన్నదే దీనికి కారణం.

వర్తమాన ఎన్నికల పద్ధతి కూడా జనసంఖ్యతో ప్రత్యక్షసంబంధం కలిగి ఉంది. వాస్తవానికి వందమంది మూర్ఖులంతా కలిసి కూడా ఒక తెలివిగలవాడితో సమ ఉజ్జీకాలేరు. కాని ఈ ఎన్నికల పద్ధతి ప్రకారం వందమంది మూర్ఖులు తొంబైతొమ్మిది మంది తెలివిగల వాళ్ళను (మేధావుల్ని) ఓడించగలరు. సమాజంలో విద్వాంసుల సంఖ్య అధికంగా ఉందా? మూర్ఖులసంఖ్య ఎక్కువగా ఉందా? సజ్జనుల సంఖ్య ఎక్కువగా ఉందా? దుష్టుల సంఖ్య ఎక్కువగా ఉందా? నిజాయితీ పరుల సంఖ్య ఎక్కువగా ఉందా? అవినీతి పరుల సంఖ్య ఎక్కువగా ఉందా? ఆలోచించండి! ఎవరి సంఖ్య ఎక్కువగా ఉంటే వాళ్ళు ఓట్లద్వారా గెలుస్తారు. దేశాన్ని శాసిస్తారు. ఏజాతి జనసంఖ్య ఎక్కువగా ఉంటే ఆ

జాతి దేశంలో రాజ్యం చెలాయిస్తుంది.

కుటుంబ దృష్టితో చూసినప్పటికి పిల్లలు ఎక్కువగా ఉన్నకుటుంబమే ఉన్నతంగా ఉంటుంది ప్రో. కోలన్ క్లార్కు, "ఎక్కువ పిల్లలున్న కుటుంబాలను తక్కువ పిల్లలున్న కుటుంబాలను రెండు విధములయిన కుటుంబాలను విస్తృతంగా సర్వేజరిపి చిన్న కుటుంబానికి చెందిన పిల్లలకంటే పెద్దకుటుంబానికి చెందినపిల్లలు అధికంగా సఫలులౌతున్నారని" తన నిష్కర్షమైన నిర్ణయాన్ని ప్రకటించాడు. (డైనిక్ టాయిమ్స్ 15–3–59)

మనోవైజ్ఞానిక నిపుణులుకూడా ఈ విషయంలో ఇలా పేర్కొన్నారు. పిల్లవాడికి అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ళతోపాటు ఆటపాటల్లో, సహవాసంలో, పరస్పరం వినోదించటానికి తగిన అవకాశం లభించకపోతే పిల్లవాడి మానసిక వికాసం తగిన విధంగా చక్కగా జరగదు. పైగా వాడు అనేక నైతిక గుణాలకు దూరమవుతాడు ఒకవేళ ఆ పిల్లవాడికి అన్నాచెల్లెళ్ళకి మధ్య వయస్సులో తేడా ఎక్కువ ఉన్నపక్షంలో (తన వయస్సుకు దగ్గరి వయస్సు కలిగిన సోదరుడు సోదరి లభించనందున) వాడికి మానసిక వైకల్యం కలుగుతుంది.

యవ్వనంలో స్త్రీపురుషులు సంతానోత్పత్తికి యోగ్యులుగా ఉంటారు. వృద్ధాప్యంలో సంతానోత్పత్తికి అయోగ్యులుగా ఉంటారు. అంటే సంతానోత్పత్తి చేసే శక్తి లేకపోవడంవల్ల మనిషి శారీరక మానసిక శక్తులు శిథిలమవుతాయి. స్త్రీ శరీరం ముఖ్యంగా సంతానోత్పత్తికోసమే నిర్మితమైయున్నది. యవ్వనదశ ప్రాప్తించగానే ఆమెకు ఋతుక్రమం ప్రారంభమవుతుంది. ఇది ఆమెను ప్రతినెలా గర్భం ధరించటానికి యోగ్యురాలినిగా చేస్తుంది. గర్భవతి అయ్యాక ఆమె శరీరంలోని అధికతమశక్తి పిల్లలను పోషించటంలో నిమగ్నమవుతుంది. అందువల్లనే పిల్లల పోషణ స్త్రీలు చెయ్యగలిగినంతగా పురుషులు చెయ్యలేరు. ఒకవేళ స్త్రీ మరణిస్తే పురుషుడు పిల్లల్ని అత్తవారింటికో, నాయనమ్మగారింటికో, చెల్లెలిగారింటికో పంపుతాడు. కాని భర్త మరణించిన పక్షంలో స్త్రీ

స్వంతంగా కష్టాలను సైతం సహించి పిల్లల పోషణభారం వహిస్తుంది. వాళ్ళను చదివించి పెద్దవాళ్ళను చేస్తుంది. దీనికి కారణం స్త్రీ మాతృమూర్తి కావడమే. ఆమెలోని ఈ శక్తిలోనే పిల్లల పోషణభారం వహించే విలక్షణమైన యోగ్యత, స్నేహభావం, కార్యదక్షతలు ఉన్నాయి. అందుకే, "మాతా సమం నాస్తి శరీరపోషణమ్" అన్నారు. అంటే తల్లితో సమానంగా శరీరపోషణ చేసేవాళ్ళెవరూలేరు. మాతృమూర్తిగా స్త్రీకి పురుషునికంటే విశేషాధికారం ఇవ్వబడింది. "సహస్రం తు పితృన్మాతా గౌరవేణాతిరిచ్యతే" (మను. 2/145). అనగా తల్లియొక్క స్థానము తండ్రికంటే వెయ్యిరెట్లు అధికంగా భావింపబడింది. నేడు గర్భపరీక్షలు జరిపించుకొని గర్భస్థశిశువు ఆడపిల్ల అయితే గర్భాన్ని పోగొట్టుకొంటున్నారు. ఇది మాతృమూర్తి యెడల ఘోర అవమానం కాదా? ఇది స్త్రీకి సమాన గౌరవం ఇచ్చినట్లేనా? సంతాన నిరోధంద్వారా స్త్రీని కేవలం భోగవస్తువుగా తయారుచేశారు. అలాంటప్పుడు భోగ్య స్త్రీ వేశ్య అవుతుంది గదా! ఇది స్త్రీజాతియెడల ఘోర అవమానం కాదా!

నోబుల్ బహుమతి గ్రహీత ఏలేక్సిజ్ కారేల్, "సంతానోత్పత్తి స్త్రీయొక్క కర్తవ్యం. ఆ కర్తవ్యాన్ని పాలించటం స్త్రీ పరిపూర్ణత్వం కోసం అనివార్యమని" అని రాశాడు.(మ్యాన్, ది అన్‌నోన్) లైంగిక, మానసిక నిపుణులు డా॥ ఆస్వాల్డ్ శ్వార్జ్ కామవాంఛలకు సంతానోత్పత్తికి సంబంధం ఉందని రాశాడు. స్త్రీ శారీరక నిర్మాణం ముఖ్యంగా గర్భధారణకోసం, పిలల్ని కనడం కోసమే ఏర్పడి ఉన్నది. అందువల్ల ఆమెను పిల్లల్ని కనకుండా నిరోధించిన పక్షంలో అది ఆమె శరీరంమీద, మనస్సుమీద ప్రతికూల ప్రభావాన్ని చూపుతుంది. దానివల్ల ఆమె వ్యక్తిత్వమునందు పరాజయం, అభావం, నీరసత మొదలయినవి కలుగుతాయి" (ది సైకాలజీ ఆఫ్ సెక్స్) స్త్రీతో సంయోగమైతే జరిపి గర్భాదానం చెయ్యని పురుషుడు పొలాన్ని దున్ని విత్తనాలు చల్లని మూర్ఖకర్షకుడు లాంటివాడు. అలాగే అతడు కేవలం నాలుక రుచికోసం (రసనానుభూతికోసం) అన్నాన్ని నమిలి, మింగకుండా బయటకు ఉమ్మివేసే మూర్ఖ మానవుడులాంటి వాడు.

సంతాన నిరోధక పద్ధతులు అమలుపరచటంవల్ల స్త్రీలో

ప్రసన్నతలోపించడం, ముక్కోపం, నిద్రలేమి, ఉద్విగ్నత, హృదయదౌర్బల్యము, మానసిక దౌర్బల్యము, రక్తప్రవాహంలో లోపం కాళ్ళుచేతుల్లో బలహీనత, ఋతుక్రమంలో అనియమత మొదలైన దోషాలు ఉత్పన్నమవుతాయని తన సంవత్సరాల అనుభవం ఆధారంగా డా॥ మేరీ శార్లీజీ రాశాడు. ఇంకా సంతాన నిరోధక పద్ధతులవల్ల స్త్రీలో జ్ఞాపకశక్తి క్షీణించడం, పిచ్చి, ఉద్రేకస్వభావం, ఋతుక్రమం బాధాకరంగా అనియతోపేతంగా రావడం, నడుమునొప్పి, ముఖసౌందర్యం, శోభ సన్నగిల్లటం మొదలైన దోషాలు ఉత్పన్నమవుతాయని ఇంకా ఇతర డాక్టర్లు కూడా ప్రకటించారు. ఇలాంటి స్త్రీ ఎప్పుడైనా గర్భవతి అయినప్పుడు గర్భావస్థలో మరియు ప్రసవకాలంలో చాలకష్టపడాల్సివస్తుంది. డా॥ ఆర్నాల్డ్ లోరెండ్ తాను రాసిన, "లైఫ్ షార్టనింగ్ హాబిట్స్ ఎండ్ రిజువినేషన్" అనే పుస్తకంలో సంతాననిరోధక పద్ధతులవల్ల కలిగే నష్టాలను విస్తృతంగా వర్ణించి చెప్పాడు. సంతాననిరోధక పద్ధతుల విషయంలో ఏ పద్ధతి కూడా విశ్వసనీయమూ, హానిరహితమూ కాదని' డాక్టర్లు అభిప్రాయపడ్డారు. అలాగే 'సంతాన నిరోధక మాత్రలు వాడటంవల్ల క్యాన్సరు వంటి భయంకర వ్యాధులు కూడా కలుగుతాయని' ఇంగ్లండుకు చెందిన డా॥ రేనియల్ డ్యూక్స్ మొదలైన డాక్టర్లు అభిప్రాయపడుతున్నారు.

మొత్తం మీద గ్రహించాల్సిందేమిటంటే తన సుఖభోగాలకోసం కొనసాగించిన సంతాననిరోధం మొదట్లో మూర్ఖత్వంవల్ల అమృతంలా భాసిస్తుంది కాని కాలక్రమేణా అది విషంలా వినాశనకారణం అవుతుంది.

భగవద్గీతలో భగవానుడు ఇలా పేర్కొన్నాడు:-

విషయేన్ద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్ ।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్ ॥ (18/38)

"ఏ సుఖమైతే ఇంద్రియాల విషయాల కలయికవల్ల ఆరంభములో అమృతతుల్యంగా ఉండి చివరికి విషంగా మారుతుందో ఆ సుఖాన్ని రాజస సుఖం అని చెప్పబడింది"

~~~oOo~~~
~~~

# కుటుంబనియంత్రణ ద్వారా కలిగే దుష్పరిణామాలను అనుభవించిన దేశాల ప్రతిక్రియ

కుటుంబనియంత్రణ ద్వారా కలిగే దుష్పరిణామాలను అనుభవించాక అనేక దేశాలు సంతాననిరోధానికి విరుద్ధంగా అనేక ఆంక్షలు విధించాయి. జనాభాపెరుగుదలకు కావలసిన మార్గాలను అమలులోకి తెచ్చాయి. జర్మనీదేశ ప్రభుత్వం సంతాననిరోధక పద్ధతులు ప్రచారప్రసారాలను నిలుపుదల చేసింది. వివాహాన్ని ప్రోత్సహించడానికి వివాహ ఋణాన్ని మంజూరు చేయడం ప్రారంభించింది. 1935వ సంవత్సరంలో ఒకచట్టాన్ని కూడా చేసింది. ఈ చట్టప్రకారం ఒక బిడ్డ పుట్టాక ఆదాయపు పన్నులో, పదిహేను శాతం మినహాయింపు, ఇద్దరు పిల్లలు పుట్టాక ముప్పదిఐదు శాతం మినహాయింపు, ముగ్గురు పిల్లలు పుట్టాక ఏబది ఐదు శాతం మినహాయింపు, నలుగురు పిల్లలు పుట్టాక డెబ్బదిఐదు శాతం మినహాయింపు, ఐదుగురు పిల్లలు పుట్టాక 95 శాతం. ఆరుగురు పుట్టాక ఆదాయపు పన్నులేకుండా మాఫీ చేసేలా వీలుకల్పించారు. దీనివల్ల అక్కడి జనాభా విశేషంగా వృద్ధి పొందింది.

ఫ్రాన్సు ప్రభుత్వం కూడా సంతాననిరోధక పద్ధతుల ప్రచారప్రసారాలకు ఆంక్షలు విధించి, జనాభాపెరగటానికి కావలసిన అనేక మార్గాలను అమలులోకి తెచ్చింది. ఎక్కువ పిల్లలుకనే వాళ్ళకి పన్నులు తగ్గించి, జీతభత్యాలు, పింఛను మొదలైనవి పెంచారు. ఇంకా వాళ్ళకి అనేక విధాలైన ఆర్థికసహాయాలు, బహుమతులు అందించటం ప్రారంభించారు.

జనాభా తరుగుదలను గనక అరికట్టకపోతే బ్రిటను నాలుగవ స్థాయికి దిగజారిపోతుందని ఇంగ్లండులో మొదటి ప్రపంచయుద్ధకాలంలో జనాభా తరుగుదలను గమనించిన అప్పటి ఆరోగ్యశాఖకు చెందిన ప్రధాన వైద్యాధికారి సర్‌జార్జి న్యూమెన్ ఒక హెచ్చరిక జారీ చేశారు – ఈ తరుగుదలను రూపుమాపటానికి "లీగ్ ఆఫ్ నేషనల్ లైఫ్" అనే పేరుతో ఒక

సంస్థను కూడా ఏర్పరచారు. ఇంగ్లండు తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోవాలంటే వెంటనే జనాభా తగ్గుదలను అరికట్టాలని అక్కడి అధికారులు ఆలోచన చేశారు జనాభా తగ్గుదలను రూపుమాపటానికి తగిన మార్గాలను అన్వేషించే ఉద్దేశ్యంతో 1944లో "రాయల్ కమీషన్" ను కూడా స్థాపించారు. 1949లో ఈ కమీషన్ తన నివేదికలో జనసంఖ్య వృద్ధికి అనేక మార్గాలను అమలు చేయడానికి తగిన సూచనలిచ్చింది. ఇందులో అధికసంతానం కలవాళ్ళకి పన్నులు తగ్గించటం, పడుకోడానికి మూడు గదులకు మించిన ఇళ్ళు నిర్మించి ఇవ్వటం, ఇల్లు నిర్మించుకోనే వాళ్ళకి (ఆర్థిక) సహాయం అందించటం మొదలైనవి ప్రధానమైనవి. దీనిప్రకారం ఇంగ్లండులో చాలా చట్టాలు చేయబడ్డాయి. ప్రజలు ఎక్కువమంది పిల్లల్ని కనటానికి ఆసక్తిని చూపించటం మొదలుపెట్టారు. దీనికోసం అక్కడ అనేక విధాలుగా ఆర్థికసహాయం, విద్య, నివాసం, మొదలైన సౌకర్యాలు కల్పించటం ప్రారంభించారు. తత్ఫలితముగా అక్కడ జనసంఖ్య అతివేగంగా వృద్ధిపొందింది.

పైన పేర్కొన్న దేశాలేకాకుండా స్వీడన్, ఇటలీ లాంటి దేశాలుకూడా సంతాన నిరోధంపై ఆంక్షలు విధించాయి. ఇటలీ దేశంలో అయితే ఒక చట్టాన్నే చేశారు. ఈ చట్టప్రకారం సంతాన నిరోధక ప్రచారం ప్రసారం చేసేవాళ్ళకు ఒక సంవత్సరం జైలుశిక్ష జరిమానా విధించవచ్చు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే – పశ్చిమదేశాలవాళ్ళు అనుభవించిన కుటుంబనియంత్రణ దుష్ఫలితాలను గమనించి కూడా భారతదేశ ప్రభుత్వం ఇంకా ఈ కార్యక్రమానికి ప్రోత్సాహాన్నిస్తోంది. **"వినాశకాలే విపరీత బుద్ధిః"** *

~~~~oOo~~~~

\* **ఈ విషయంలో మరిన్ని వివరాలు తెలుసుకోదలచినవారు గీతాప్రెస్ వారు ప్రచురించిన "మహాపాపంనుండి కాపాడుకో" అనే పుస్తకాన్ని చదవాలి.**
~~~~

# 3. ఘోరపాపాలనుండి బయట పడండి

అశుద్ధ స్వభావంగల సాంసారిక పురుషులకు ప్రపంచంలోనే సుఖాలు కనిపిస్తాయి. సాంసారిక సుఖాలకంటే కూడా పారమార్థిక సుఖం ఒకటుంది. ఈ విషయం వాళ్ళు బొత్తిగా ఎరగరు. అలాంటి అసురస్వభావంగల మనుషులు సాంసారిక భోగాలను చూసుకొని ఇవేసుఖాలు, ఇంతే చాలుననుకొంటారు. అంతకు మించిందేదీ లేదని నమ్ముతారు. "కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః ।" (గీత. 16/11) "నాన్యదస్తీతి వాదినః" (గీత. 2/42). కాని సాత్త్విక స్వభావం గల పారమార్థిక సాధకులకు పరమాత్మలోనే సుఖం, ఇంతకు మించిన మరోసుఖం వాళ్ళ మనస్సులోనికి రానేరాదు – "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।" (గీత. 6/22)

లౌకిక (సాంసారిక) మానవులు సాధకులకు మధ్య ఒక తేడా ఉంది. ఈ లౌకిక మానవులు పారమార్థిక సుఖాలను ఎరుగనైనా ఎరుగరు. సాధకులైన (యోగులైన వారు) పారమార్థిక సుఖాలతోపాటు సాంసారిక సుఖాలను కూడా ఎరుగుదురు. సాధకులకంటే సిద్ధపురుషులు, తత్త్వజ్ఞులైన మహాత్ములు ఇంకా బాగా ఎరుగుదురు. (జ్ఞానులు) తత్త్వజ్ఞులైన మహాత్ములకే సంపూర్ణ జ్ఞానం ఉంటుంది. * ఎందుకంటే వారు మొదట్లో మామూలు మనిషిగాను ఉన్నారు. ఆపైన అనేక గ్రంథాలను చదివి

---

* పరమాత్ముడు తత్త్వజ్ఞానియైన మహాత్ముణ్ణి "సర్వవిదుడు" (సర్వజ్ఞుడు) అని అన్నాడు.

యోమామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్ ।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత ॥
(గీత. 15/19)

"అర్జునా! ఈ విధంగా మోహరహితుడైన వాడు ఎవడు నన్ను పురుషోత్తమునిగా ఎరుగునో, అట్టి సర్వజ్ఞుడు అన్నివిధాలా నన్నే భజిస్తాడు."

ఉంటారు. సత్సంగాలు చేసి ఉంటారు. సాధనచేసి తత్త్వాన్ని కూడా అనుభవంలోకి తెచ్చుకొని ఉంటారు. ఈ విధంగా వారు ఆదినుండి అంతంవరకు అంతా (తెలుసుకొనే ఉంటారు) వారు ఇటు సంసారాన్ని పూర్తిగా ఎరుగుదురు, మరియు అటు పరమాత్మతత్త్వమును కూడా తెలుసుకొని ఉంటారు.

లౌకిక మానవులు సాంసారిక విషయాలను కూడా పూర్తిగా ఎరుగరు. ఇంక పారమార్థిక విషయాలను ఎలా తెలుసుకోగలరు? కారణమేమంటే సాంసారిక జ్ఞానం ఈ సంసారంనుండి భిన్నంగా ఉన్నప్పుడే అవగతమవుతుంది. మరియు పరమాత్మ జ్ఞానం పరమాత్మలో అభిన్నంగా ఉన్నప్పుడే కలుగుతుంది. మనుజుడు అశుద్ధప్రకృతినుండి వేరుపడకుండా శుద్ధ ప్రకృతికి గౌరవం ఇవ్వనేలేడు. మరొగొప్ప తేడా ఏమిటంటే అశుద్ధ ప్రకృతి కలవాళ్ళు శుద్ధప్రకృతి కలవారితో శత్రుత్వం వహిస్తారు. కాని పారమార్థిక సాధకులు లౌకిక మానవులతో శత్రుత్వం వహించనే వహించరు. *

గర్భపాతం, కుటుంబనియంత్రణ మొదలైన వాటిద్వారా సంతానాన్ని నిరోధించటం అశుద్ధప్రకృతికల మనుషులపని. అశుద్ధప్రకృతి మితిమీరితే మళ్ళీ దానినుండి తప్పుకోవడం చాలా కష్టమవుతుంది. దుర్వ్యసనాలకు

---

* మృగమీనసజ్జనానాం తృణజలసంతోషవిహితవృత్తీనామ్ ।
లుబ్ధకధీవరపిశునా నిష్కారణవైరిణో జగతి ॥
(నారదపురాణం. పూర్వ. 37/38 భర్తృహరినీతి. 61)

"జింక, చేప, సజ్జనులు వరుసగా తృణంతో, జలంతో, సంతోషంతో తమజీవనాన్ని గడుపుతారో (ఎవరికీ దుఃఖం కలుగజేయరు). కాని బోయవాడు, బెస్తవాడు, ఇంకా దుష్టజనులు కారణం లేకుండానే శత్రుత్వం వహిస్తారు."

ఉమా జే రామచరన్ రత బిగత్ కామ మదక్రోధ
నిజ ప్రభుమయ దేఖహిం జగత్ కేహి సన కరహిఁ బిరోధ ॥
(మానస. ఉత్తర. 112ఖ)

బాగా అలవాటుపడితే వాటిని వదిలించుకోవడం చాలాకష్టమవుతుంది. అలాగే కృత్రిమ మార్గాలద్వారా సంతానాన్ని నిరోధించుకొనే పద్ధతిలేదా నడవడి అలవాటుపడితే దానిని తొలగించుకోవడం మరింత కష్టమవుతుంది. ఈ అలవాటు లేదా వ్యసనం మనిషిని నాశనం చేస్తుంది మానవత్వాన్నే నాశనం చేస్తుంది. ఎందుచేతనంటే నాశనంవైపు బుద్ధి మళ్ళిందంటే అది అటువైపే ప్రవర్తిస్తుంది. బుద్ధివికాసం కూడా నాశనం వైపే ఉంటుంది. నాశనం చెయ్యడానికి కొత్తకొత్త పద్ధతులు ఆవిష్కారం జరుగుతుంది. దీని ఫలితం భయంకరంగాను, అనర్థదాయకంగాను ఉంటుంది.*

దేశంలో నేడు భోగేచ్ఛయొక్క తాండవనృత్యం జరుగుతూంది. సంతాననిరోధం వెనక కూడా భోగేచ్ఛ మినహా వేరేమరోకారణంలేదు. భోగపురుషులు ఎక్కువ అవటంవల్ల కర్తవ్యపరాయణుల సంఖ్య తగ్గిపోతుంది. కర్తవ్యపరాయణులు తగ్గిపోవడంవల్ల ఉత్పాదన తగ్గి ఖర్చు అధికమవుతుంది. ఎందుకంటే లౌకికావసరాలు భోగపురుషులకే ఎక్కువ ఉంటాయి. త్యాగపురుషులకు ఉండవు. ఖర్చులు అధికమవడంతో దేశం ఋణగ్రస్తమైపోతుంది.

వాస్తవానికి భారతదేశానికి కుటుంబనియంత్రణ ఆవశ్యకతయే లేదు. ఎందుకంటే భారతదేశంలో అపారమైన ప్రకృతిసంపద ఉంది. భారతభూమిమీద సూర్యకిరణాలు సంపూర్ణంగా పడుతున్నాయి. అందువల్ల భారతదేశంలో ఆరు ఋతువులుంటాయి. అనేక విధాలయిన జలవాయువులు లభిస్తాయి. అలా ఏ ఇతరదేశంలోనూ లభ్యం కావు.

---

* ఉదాహరణకు తమిళనాడుకు చెందిన ఉసలియాము పట్టి దానిచుట్టుపక్కల గ్రామాల్లో అప్పుడే పుట్టిన ఆడపిల్లల్ని హతమార్చే పద్ధతినెలకొని ఉన్నది. దీన్ని అరికట్టడానికి 'భారతీయ బాలకల్యాణ పరిషత్తు' మరియు అక్కడి ప్రభుత్వం యొక్క సర్వ ప్రయత్నాలు విఫలమవుతున్నాయి. 1993–94 సం॥ మధ్య అక్కడ నాలుగు వందల మంది అప్పుడే పుట్టిన ఆడపిల్లలు హత్యచేయబడ్డారు ఇది అనేక వార్తాపత్రికల్లో, మేగజైన్లలో ప్రచురింపబడింది.

భారతదేశంలో పండినన్ని ఓషధులు, వనమూలికలు, వృక్షఖనిజ పదార్థాలు, ఆహారధాన్యాలు, పండ్లు, కూరగాయలు, ఏ ఇతర దేశంలోను పండవు. అలాగే భారతదేశంలో పొందగలిగినన్ని విద్యలూ, కళాకౌశలాలూ, మరే ఇతర దేశంలోనూ లభ్యంకావు. ఒక్కొక్క విషయం మీద ఇక్కడ పొందగలిగినన్ని గ్రంథాలను మరే ఇతర దేశంలోను పొందలేము. పరిశోధన జరపటానికి ఇక్కడ బోలెడు సామాగ్రి ఉంది. భారతదేశంలో ఉద్భవించినట్టి శూరులు, మహాసతీమణులు, యోగులు, త్యాగమూర్తులైన సత్పురుషులు, ఋషిపుంగవులు, తపోధనులు, మహారాజులు, సంయమీంద్రులు, మరే ఇతరదేశంలోనూ ఉద్భవించలేదు. ప్రభుత్వం ఇక్కడి శాస్త్రజ్ఞులకు తగిన ప్రోత్సాహాన్ని అందించిన పక్షంలో వారు విదేశాలకు తరలి పోకుండా భారతదేశంలోనే ఉండి పరిశోధనలు జరిపినపక్షంలో భారతదేశంలోనే అపారమైన ఆవిష్కారాలు జరుగగలవు. దీనివల్ల ఈ దేశం విశ్వమంతటికీ విద్యాప్రదాయిని కాగలదు.

జనసంఖ్య అధికమయితే పంటకూడా అధికమవుతుంది. దీనివల్ల ఇతరదేశాలకు కూడా లాభం కలుగుతుంది. ఎప్పుడు జనసంఖ్య తక్కువగా ఉండేదో అప్పుడు ఆహారధాన్యాలను విదేశాలనుండి అభ్యర్థించాల్సి వచ్చేది. ఈ విషయం మనకు ప్రత్యక్షంగా తెలిసిన విషయమే! కాని ఇప్పుడు జనాభాపెరిగినప్పటికి ఆహార ధాన్యాలను ఇంకా అనేక ఇతరవస్తువులు ఇతరదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. ప్రభుత్వానికి ఇదేమీ దాచిన రహస్యంకాదు. కాకపోతే ప్రభుత్వం ఇటువైపు దృష్టిసారించటం లేదు. ఆవశ్యకతయే ఆవిష్కారానికి మూలం. జనసంఖ్య పెరుగుతుందంటే వారివారి జీవననిర్వాహక సాధన సంపత్తికూడా పెరుగుతుందన్నమాట! అలాగే ఆహారధాన్యాలు పంటకూడా బాగా పెరుగుతుంది. వస్తువుల ఉత్పాదన కూడా పెరుగుతోంది. పరిశ్రమలు పెరుగుతున్నాయి. కానినేడు విపరీత బుద్ధిపుట్టుకొస్తుంది. ఉత్పాదన పెంచాలనుకొంటున్నారు గాని ఉత్పాదన చేసేవాళ్ళు పుట్టకుండా నిరోధిస్తున్నారు. దేశంలో జన్మించిన ప్రతిపౌరుని జీవన నిర్వహణవ్యవస్థను పటిష్టం చేయడం ప్రభుత్వకర్తవ్యం కావాలి గాని వారిని పుట్టకుండా నిరోధాన్ని ప్రకటించటం కాదు. ఒకమనిషి దగ్గర 100 ఎకరాల భూమి సాగు చెయ్యటానికి ఉందనుకొందాం. అతనికి

ఇద్దరుమగ పిల్లలున్నారు. ఒకడు బొంబాయిలో ఉద్యోగం చేస్తుంటే మరొకడు తలిదండ్రులవద్దనే ఉండి సేవలు చేస్తున్నాడు. ఇప్పుడు ఆ భూమిని సంబాళించు వాడెవడూ లేడు. జనసంఖ్య తగ్గిపోతే జరగబోయే పరిస్థితి ఇదే!

జనసంఖ్య నియంత్రించే పని ప్రకృతిదికాని మనుష్యులదికాదు. ప్రకృతి ద్వారా జరిగే కార్యక్రమాలద్వారా అందరికీ మేలుజరుగుతుంది. ఎందుకంటే అది పరమాత్ముని సంకేతాలతో నడుస్తుంది. * కాని మనిషి భోగబుద్ధితో జరిపే కార్యక్రమం ద్వారా అందరికీ అహితము మాత్రమే జరుగుతుంది. ప్రకృతిచేసే కార్యక్రమంలో మనిషి జోక్యం చేసుకొన్నట్లయితే దీని పరిణామం మహాభయంకరంగా ఉంటుంది.

కోట్లాది సంవత్సరాలనుండి సృష్టిజరుగుతూ వస్తోంది. ప్రకృతిద్వారా ఎల్లప్పుడూ జనసంఖ్య నియంత్రణ జరుగుతూ వస్తోంది. ఎప్పుడైనా జనసంఖ్య పెచ్చు పెరిగిపోతే భూకంపాలు, ఉల్కాపాతాలు, వరదలు, కరువుకాటకాలు, యుద్ధాలు, కలరావంటి అంటువ్యాధుల కారణంగా అదే తగ్గిపోయింది. కాని ప్రజలు విస్తృతంగా గర్భపాతాలు చేయించుకోటంగాని, కుటుంబనియంత్రణ ఆపరేషన్లవంటి కృత్రిమ పద్ధతుల ద్వారా జనసంఖ్యను తగ్గించే ప్రయత్నం చేసినట్లుగాని ఇప్పటివరకూ చరిత్రలో ఎన్నడూ చదవలేదు, వినలేదు. వాస్తవానికి మానవుడికి జనాభాను నియంత్రించే బరువుబాధ్యతలు లేవు. ఒక మనిషి జన్మించుటకు తొమ్మిది, లేక పదినెలలు పడుతుంది. కాని మరణించటానికి సమయం పట్టదు. ప్రకృతి సంబంధమైన ప్రకోపాలవల్ల వేలకొలది,

---

* మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్ ।
హేతునానేన కౌంతేయ! జగద్విపరివర్తతే ॥
(గీత. 9/10)

"ప్రకృతి నా ఆధ్వర్యంలో సకలచరాచర జగత్తును సృష్టిస్తోంది. కౌంతేయా! ఈ కారణంగానే జగత్తుయొక్క వివిధ విధాల పరివర్తన జరుగుతోంది."

# ఘోరపాపాలనుండి బయట పడండి

కోట్లకొలది మనుషులు ఒక్కసారిగా మరణిస్తారు. కృత్రిమ పద్ధతుల్లో సంతానాన్ని నిరోధించుకొంటే, ఆ అలవాటులో పడిపోతే మనుష్యుల పుట్టుకమీద నిషేధం ఏర్పడుతుందిగాని, మరి మృత్యువును ఎవరు అరికట్టగలరు? మృత్యువు ఎల్లప్పుడూ ఎప్పటిలాగే తనపని తాను చేస్తూనే ఉంటుంది. మరి అలాంటప్పుడు పరిణామమేమవుతుంది? ఒక గ్రామములో జరిగిన యథార్థగాథ చెబుతాను వినండి! ఆ వూళ్ళో ఒక పెద్దమనిషికి ఇద్దరు కొడుకులుండేవారు. అతడు కుటుంబనియంత్రణ ఆపరేషన్ చేయించుకొన్నాడు. దానితర్వాత ఒక పిల్లవాడు చనిపోయాడు. కొంత కాలమయ్యాక రెండో పిల్లవాడు కూడా చనిపోయాడు. ఇప్పుడు ఆ ముసలి తల్లిదండ్రులకు సేవచెయ్యటానికి ఎవ్వరూ లేరు! మేము దక్షిణప్రాంత పర్యటనకు వెళ్ళినాము. అప్పుడు ఓ భార్యాభర్తలజంట నా దగ్గరకు వచ్చి నాతో ఇలా అన్నారు – "మాకు ఇద్దరు కొడుకులున్నారు. మేము (ఆపరేషన్) చేయించుకొన్నాం. ఒక కొడుకు పిచ్చికుక్క కరవటంవల్ల చనిపోయాడు. ఇప్పుడు ఒక పిల్లవాడే మిగిలాడు తమరు ఆ ఉన్న ఒక్కపిల్లవాణ్ణి దీర్ఘాయుష్మంతుడుగా ఉండేలా ఆశీర్వదించాలి" అని అడిగారు. అప్పుడు–"మీయింట్లో పిల్లల్ని కనే ఖజానా ఉంది. దాన్ని మూసేసి ఆశీస్సులు నన్నడుగుతున్నారా! నాలో ఆశీస్సులు ఇచ్చేంత యోగ్యత ఉన్నట్లు నేను భావించటంలేదు" అని అన్నాను.

జనసంఖ్య పెరిగిపోవడంవల్లనే పాపం అధికంగా పెరిగిపోతుందని కొందరు చెబుతున్నారు. ఇది పూర్తిగా అసత్యమైనమాట. పాపం జనసంఖ్య పెరగటంవల్ల పెరగదు. ఎలా పెరుగుతుందంటే మనుషుల్లో ధార్మికత, ఆస్తికత లేనందువల్ల, భోగేచ్ఛ పెరిగిపోవటంవల్ల పెరుగుతోంది. దీనికి కారణం ప్రభుత్వమే! ప్రజల్లో ధర్మం యెడల, దేవుని యెడల, విశ్వాసం సన్నగిల్లిపోతోంది. పైపెచ్చు భోగేచ్ఛ పెరిగిపోతుంది. ఇలా జరగటానికి వీలైన విద్యనే ప్రసాదిస్తున్నారు. ఇందుమూలంగా రకరకాల పాపాలు పెచ్చు పెరిగిపోతున్నాయి. ఈ విధంగా జానాభాకాదు, మనుషుల్లో పెచ్చు పెరుగుతున్న నిష్క్రియాపరత్వం, ప్రమత్తత, అలసత్వం వ్యసనం వంటివే దానికి కారణాలు. మనుషుల్లో భోగవాంఛ బాగా వర్ధిల్లుతుంది. నిష్క్రియాపరులు, విలాసపురుషులే పాపులు, సోమరులు, వ్యసనపరులు

అవుతారు. సాధకులైన సాత్త్వికపురుషులకు ఖాళీ సమయమే ఉండదు.

ఏదేశాన్నైనా నాశనం చెయ్యాలంటే రెండు పద్ధతులున్నాయి. ఒకటి పుట్టకుండా చేయటం, రెండోది చంపివేయడం. నేడు మనుషులు పుట్టకుండా అరికడుతున్నారు. పశువులను చంపేస్తున్నారు. మానవ వినాశానికి "కుటుంబసంక్షేమం" అనిపేరు పెట్టారు. పశువుల్ని నాశనం చెయ్యడాన్ని "మాంసోత్పాదన" అని అంటున్నారు. వినాశకాలం దాపురించినపుడు ఇలాంటి విపరీత రాక్షస బుద్ధే పుడుతుంది.

నేటి మనుష్యులు రాక్షసులకంటె నికృష్టులు. రాక్షసులు దేవతల్ని ఉపాసించేవారు. తపస్సు చేసేవారు. జపతపాదులు నిర్వర్తించేవారు. దేవతలనుండి శక్తిని కూడా సంపాదించేవారు. కాని నేటి మానవుల ప్రవృత్తి (ఇతరుల్ని నాశనం చెయ్యటంలో) రాక్షసుల వంటిదే. అయినా దేవతలు, తపస్సులు, జపతపాదులు మొదలైన వాటిని నమ్మటం లేదు సరిగదా! అవన్నీ వృథా అని తలుస్తున్నారు.

కుటుంబనియంత్రణ ప్రచారంవల్ల పరిస్థితి ఎంతగా పతనమయిందంటే తల్లి తన గర్భంలో ఉన్న సంతానాన్ని తనే నాశనం చేసుకొంటుంది. నేను ఒక అత్తాకోడళ్ళ కథవిన్నాను. కోడలు ఇద్దరు పిల్లలు పుట్టాక గర్భపాతం చేయించుకోవాలనుకొంది. కాని ఆమె అత్తగారు అలా చేయడాన్ని అడ్డగించింది. ఆమెకు మగపిల్లవాడు పుట్టాడు. ఆ తరువాత మళ్ళీ నాలుగోసారి గర్భవతయింది. అప్పుడు ఆకోడలు అత్తగారికి చెప్పకుండా పుట్టింటికి వెళ్ళిపోయి, గర్భస్రావం చేయించుకొని, దానితోపాటే పిల్లలుపుట్టకుండా శస్త్రచికిత్స (ఆపరేషను) కూడా చేయించుకొంది. ఇప్పుడు మూడవపిల్లవాడు పెద్దవాడయ్యాడు. వాడిని 'ఇంగ్లీషు కాన్వెంటులో చేపించారు. అత్తగారు – "అమ్మా! మనది సామాన్యమైన కుటుంబం, ఇంగ్లీషు స్కూల్లో ఖర్చులు చాలా అవుతాయి పైగా ఆ పాఠశాలలో పిల్లలకు ఉత్తమ సంస్కారము అలవడదు" అని వారించింది. అత్తగారితో కోడలు ఈ ఆపద అంతా కలిగింది నీవలననే. నేటి మాతృమూర్తి పరిస్థితి ఎలా ఉందంటే ఆమెకు తన సంతానమే తనకి

నచ్చడంలేదు. అత్తగారు ఘోర పాపంనుంచి కోడల్ని రక్షించినా అత్తగార్నే తిట్టిపోస్తోంది! అంతరాంతరాల్లో పాపానికి ఎంత గౌరవం ఉందో చూడండి!

మనిషికి తనహద్దుల్లో తాను ఉండాల్సిన అవసరం ఉంది. జనాభా నియంత్రణ కార్యక్రమాన్ని మనిషి తన చేతుల్లోకి తీసుకొన్నట్లయితే దీనివల్ల ప్రకృతి కోపోద్రిక్తురాలౌటవలన పరిణామం మహాభయంకరంగా ఉంటుంది. మానవునికి కేవలం తనకర్తవ్యాన్ని పాలించటానికి, ఇతరులకు సేవచేయాడానికి, భగవంతుని ఆరాధించటానికి, భోగాలను త్యాగం చెయ్యటానికి సంయమంగా ఉండటానికి బాధ్యత కల్పింపబడింది. భోగాలను త్యజించటం, నిగ్రహాన్ని పాటించటం మనిషే చెయ్యగలడు. సంతానేచ్ఛలేకపోతే నిగ్రహంగా ఉండాలి మనిషి కోరుకుంటే ఎల్లకాలం నిగ్రహంగా ఉండగలడు. సత్సాంగత్యం గల ఒకసోదరికి ఇద్దరు పిల్లలున్నారు. "కృత్రిమపద్ధతులద్వారా కుటుంబనియంత్రణ పాటించలేదే?" అని నేను ఆమెనడిగాను. "మీరు దానిని నిషేధించినప్పుడు ఆపని మేమెందుకు చెయ్యాలి? తమరు నిగ్రహాన్ని గురించి చెబుతూంటారు గదా! అందువల్ల మేము బ్రహ్మచర్యాన్ని పాటిస్తున్నాం" అని సమాధానం చెప్పింది. ఇలా అనేకమంది స్త్రీపురుషులు బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ ఉండవచ్చును. నిగ్రహంగా ఉండటంవల్ల శారీరకంగా, పారమార్థికంగా అన్నివిధాలా ఉన్నతికలుగుతుంది. అనేక రోగాలు సంయమాన్ని పాటించకపోవడం వల్లనే పుట్టుకొస్తున్నాయి. సంయమంవల్ల ఆరోగ్యం బాగుపడుతుంది. ఇంకా ఆయువు కూడా పెరుగుతుంది.

మనదేశంలో అనాదిగా సంయమానికి ప్రాధాన్యత ఉన్నది. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమాలు నాలుగింటిలో కేవలం గృహస్థాశ్రమంలోనే సంతానోత్పత్తి విధానం ఉన్నది. కాని సంయమన ప్రాధాన్యత అన్ని ఆశ్రమాలలోనూ యున్నది. ప్రభుత్వం ఆశ్రమ వ్యవస్థను అంగీకరించక సాధుపురుషుల తిరస్కారము చేస్తుంది. సత్సాంగత్యం, సదాచారం, సంయమం వంటి మంచి విషయాలు ప్రచారానికి విముఖత చూపిస్తూ సంతాన నిరోధక కృత్రిమ పద్ధతులద్వారా ప్రజల్ని భోగపరాయణులుగా, నిగ్రహరహితులుగా, తయారుకావడానికి

ప్రేరేపిస్తుంది.

పరిపాలకుడు తండ్రితో సమానుడు. ప్రజలు పుత్రులతో సమానము. దేశంలోని పౌరులను పాపాలనుంచి రక్షించి కర్తవ్యపాలనలో, ధర్మపాలనలో నిమగ్నులయ్యేలా చేయడం ప్రభుత్వకర్తవ్యం. కాని నేడు ప్రభుత్వం దానికి విరుద్ధంగా ప్రజల్ని అనేక పాపములలోనికి లాగుతూ, విభిన్న ప్రచారమాధ్యమాలద్వారా, వాళ్ళకి గర్భపాతం, మాంసం, చేపలు, గ్రుడ్లు మొదలైనవి తినుట వంటి పాపాలు చేయడానికి ప్రేరితులను చేస్తోంది. వారిని భయపెడుతూ, ప్రలోభపెడుతూ గర్భపాతం, కుటుంబనియంత్రణ ఆపరేషనుకు ఇన్ని కేసులు తీసుకురా! బహుమతులిస్తాం! లేకపోతే ఉద్యోగంలోంచి తొలగిస్తాం! జీతాలివ్వం! అంటుందో – అంటే పాపాలు చెయ్యి! బహుమతులిస్తాం! చెయ్యకపోతే శిక్షిస్తాం అన్నమాట. ఇది ప్రభుత్వపరంగా ఎంతటి అన్యాయపూర్వకమైన విధానమో చూడండి! ఇంతేకాదు ప్రభుత్వానికి ఈ పాపాలతో సంతృప్తికలగటం లేదు. ప్రభుత్వం గర్భపాతం, సంతాన నిరోధానికి సంబంధించి కొత్తకొత్త మార్గాలను అన్వేషిస్తోంది. పశువులను వధించుటకు కూడా నూతన వధ్యశాలలు స్థాపించుచున్నది. అలాంటప్పుడు దేశంలో సుఖశాంతులు ఎలా కలుగుతాయి?

~~~~oOo~~~~
~~~~

# 4. గర్భపాతం ఎందుకని మహాపాపం?

పాపాలనేవి ఒకరు ఒప్పుకోవడం లేదా ఒప్పుకోకపోవడం మీద ఆధారపడి ఉండవు. పాపాల విషయంలో ఫలానాది పాపకార్యము అని చెప్పడానికి వేదాలు, పురాణాలు, స్మృతులు, శాస్త్రాలు ఇంకా అనుభవజ్ఞులైన తత్త్వజ్ఞుల వచనాలు మాత్రమే ప్రమాణాలు. గర్భస్రావం, గర్భపాతం లేదా భ్రూణహత్య హిందూధర్మానికి, భారతీయ సంస్కృతికి అన్నివిధాలా విరుద్ధమైనవి. ప్రపంచంలోని ఏ ఉత్తమ ధర్మమూ దీనిని సమర్థించదు. సమర్థించజాలదు కూడా. కారణం ఇది మానవత్వానికే విరుద్ధమైనది కావడమే. క్రూరమైన మరియు హింసా ప్రవృత్తిగల పశువులుసైతం ఇలాంటి పని చేయవు.

ఈ ప్రపంచంలో మానవజాతి సర్వోత్కృష్టమైనది. ప్రపంచంలో అన్ని ప్రాణుల పరిరక్షణ, సేవ, పోషణ చేసే అధికారం, యోగ్యతా, సామర్థ్యం, సామగ్రి దయాగుణం అన్నీ మనిషిలోనే ఉన్నాయి. అలాంటి మనిషిని చంపివేయటం (హత్య) ఘోరాతిఘోరమైన పాపం! మనుషులలోనే చిన్న పిల్లవాణ్ణి హత్యచేయడం అన్నింటికంటే మహాపాపం. ఎందుకంటే పిల్లవాడు నిరపరాధి, నిర్బలుడు, నిర్దోషి అయి వుంటాడు. అలాంటప్పుడు ఇంకా పుట్టనైనా పుట్టని బిడ్డని, ఇంకా గర్భవాసంలోనే ఉన్న బిడ్డని చంపివేయడం మహాభయంకరమైనపాపం

మాతృగర్భంలో జీవుడు నిర్బలమైన అసహాయమైన స్థితిలో ఉంటాడు. ఆ జీవుడు తన రక్షణకోసం ఏమీ చేసుకోలేడు. ఎదురించి ప్రతి చర్యకు పూనుకొనలేడు. తనపై జరుపబడే హత్యా ప్రయత్నంనుండి బయటపడటానికి ఆర్తనాదం కూడా చేసుకోలేడు. రోదించనైనా రోదించలేడు. బిగ్గరగా అరవనైనా అరవలేడు. వాడు (గర్భస్థశిశువు) చేసిన అపరాధం కాని, దోషంగాని లేదు. అతడు అన్నివిధాలా నిర్దోషి. అలాంటి స్థితిలో నిరపరాధి, నిర్దోషి అయిన శిశువును హత్యచేయటం ఎంతటి మహాపాపం! వైరవిరోధులతో తలపడే యుద్ధాలలోసైతం శత్రువుని వధించటమే

లక్ష్యంగా ఉంటుంది. అయినప్పటికి దానిలో కూడా నిరాయుధుడైన సైనికుడి మీద శస్త్రం సంధింపబడదు. ముందు అతణ్ణి సావధానుణ్ణి చేస్తూ యుద్ధానికి పిలుపు నిస్తారు. అప్పుడే శస్త్రాలను ప్రయోగిస్తారు. కాని గర్భస్థశిశువు పాపం! అన్నివిధాలా అసహాయుడై పడి ఉంటాడే! వాడికి ఎవరో నన్ను చంపుతున్నారన్న జ్ఞానం కూడా ఉండదే! అలాంటి స్థితిలో ఉన్న ఆ మూగప్రాణిని బాధాకరంగా హత్య చేయడం ఎంతటి భయంకరమైన పాపం? ఎంత ఘోరమైన అన్యాయం?

ఒకలోకోక్తి ఇలా చెబుతోంది – తన చేత నాటబడిన విషవృక్షం కూడా ఖండింపబడదట "విషవృక్షోకపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రతమ్ ।" స్త్రీ పురుషులిద్దరూ కూడా ఏర్పరచుకొనే గర్భాన్ని తమద్వారానే హత్య చేయడం ఎంతటి మహాపాపం! (అసంయములై) తప్పుతామే చేస్తూ ఏ దోషం ఎరుగని గర్భస్థపిండాన్ని మాత్రం హత్య చేస్తున్నారు ఎంతటి ఘోర అన్యాయం! తమబిడ్డని స్నేహపూర్వకంగా ప్రేమపూర్వకంగా పోషించవలసిన, పరిరక్షించవలసిన తల్లిదండ్రులే తమ గర్భస్థశిశువులను హత్యచేసే పక్షంలో ఇక ఎవరు రక్షిస్తారని ఆశించాలి. పిల్లలకి తల్లిదండ్రులు దైవంతో సమానం "మాతృదేవో భవ, పితృదేవో భవ" అలాంటి వారు తమ సంతానాన్ని పుట్టకముందే నాశనం చేసేపక్షంలో ఇక రక్షించేవారెవరు?

సాధుపురుషులు చాతుర్మాస్యవ్రత సమయంలో ఒకచోట చేరతారు. స్థావరములైన చెట్ల తాలూకు అంకురోత్పత్తి కాలంలో కాళ్ళకిందపడి, అవి నలిగిపోకుండా ఉండేందుకే అలా చేస్తారు. స్థావరప్రాణుల హింసనే ఇంతటి పాపంగా భావిస్తున్నప్పుడు మరి జంగమ ప్రాణుల విషయంలో జరిగే హింస ఎంతటి పాపం? జంగమ ప్రాణులలో మనిషి సర్వశ్రేష్ఠమైనవాడు. అలాంటి మనిషిని గర్భంలోనే హత్యచేయడం ఎంతమహాపాపం? ఇంతకు మించిన పాపం మరొకటి ఉండదు.

గర్భస్థమైన జీవుడు జన్మించిన తరువాత ఎన్నెన్ని మంచి లౌకిక పారమార్థిక కార్యాలు చేస్తాడు. సామాజికమైన సేవలు, దేశానికి

సంబంధించిన సేవలు చేస్తాడో, ఎంతమంది ప్రజలకు సహాయం చేస్తాడో సజ్జనుడో, సత్పురుషుడో అయి ఎంతమందిని సన్మార్గంలో నడిపిస్తాడో తనకి, ఇతరులకి సంక్షేమం కలిగిస్తాడో వ్యవసాయం చేస్తాడో, ఎన్నెన్ని ఫ్యాక్టరీలు ప్రారంభిస్తాడో ఏమేమి చెయ్యగలడు మనకి తెలియదు. కాని వాడు పుట్టకముందే చంపివేయడం ఎంత మహాపాపం? గర్భంలో ప్రవేశించిన జీవుడు ఎవరో, ఎలా ఉంటాడో మనమెరుగుదుమా? ఒకవేళ మహాత్మగాంధీ, లోకమాన్యతిలక్, స్వామి వివేకానంద వంటి వారిని జన్మించక పూర్వమే గర్భపాతం చేసి ఉంటే దేశానికి ఎంతటి నష్టం వాటిల్లి ఉండేదో గదా".

బ్రతకనీయడం చెతకాని వాళ్ళకి చంపే అధికారం ఎలా వస్తుంది? జీవమాత్రులకు జీవించే అధికారం ఉంది. వాడిని గర్భంలోనే విచ్ఛిత్తిచేసి వాడి అధికారాన్ని లాగుకోవడం మహాపాపం. మానవుడికి ఇతరులకు సేవచేయటానికి, వారిని సుఖపెట్టడానికి అధికారం ఉంది. కాని ఇతరులను నాశనం చేసే అధికారం ఎక్కడా లేదు. ఈ గర్భపాతం పరిపాటి అయిపోయేపక్షంలో మనిషి రాక్షసులకంటే కూడా మించిన రీతిగా అధః పాతాళానికి దిగజారిపోతాడు. రావణాసురుడు, హిరణ్యకశిపుడు, మొదలైన రాక్షసుల రాజ్యంలో కూడా ఇలాంటి మహాపాపం జరగలేదు.

శాస్త్రగ్రంథాల్లో ప్రతిచోట గర్భపాతం మహాపాపంగా అంగీకరించబడింది. పరాశరస్మృతిలో ఇది బ్రహ్మహత్యాపాతకంకంటే రెట్టింపు పాపంగా పేర్కొనబడింది.

యత్పాపం బ్రహ్మహత్యాయా ద్విగుణం గర్భపాతనే ।
ప్రాయశ్చిత్తం న తస్యాస్తి తస్యాస్త్యాగో విధీయతే ॥
(4/20)

"బ్రహ్మహత్యవలన కలిగే పాపంకంటే రెట్టింపు పాపం గర్భపాతం చేయడంవలన కలుగుతుంది. ఈ గర్భపాతరూపమైన మహాపాపానికి మరోప్రాయశ్చిత్తం కూడాలేదు. ఇందులో ఇంకా ఆ స్త్రీని త్యజించాలని కూడా విధించబడింది".

గర్భపాతం చేసుకొన్న పాపాత్ముల దృష్టి అన్నంమీద పడితే కూడా ఆ అన్నం కూడ అభక్ష్యంగా అవుతుంది.

భ్రూణఘ్నావేక్షితం చైవ సంస్పృష్టం చాప్యుదక్యయా ।
పతత్రిణావలీఢం చ శునా సంస్పృష్టమేవచ ॥
(మనుస్మృతి.4/208)

భ్రూణహత్య చేసిన వాళ్ళచే చూడబడిన, రజస్వల అయిన స్త్రీచే తాకబడిన, పక్షిచే భక్షించబడిన, కుక్కచే స్పృశించబడిన అన్నం తినకూడదు.

మానవశరీరం అతి దుర్లభమైనదిగా చెప్పబడినది.

బడే భాగ మానుష తను పావా । సుర దుర్లభ సబ గ్రంథన్హి గావా ॥

మనుష్య శరీరము లభించుట గొప్ప భాగ్యము. దేవతలకు ఇది దుర్లభమని అన్ని గ్రంథములు చెప్పుచున్నవి. అవ్యాజకరుణామయుడైన భగవంతుడు కృపచే జీవునికి మానవ శరీరమును ప్రసాదించును.

దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః ।
(శ్రీమద్భా. 11/2/29)

పరమదయాళుడైన పరమాత్ముడు అపారమైన దయతో జీవునికి మానవ శరీరాన్ని ప్రసాదిస్తాడు.

కబహుఁక్ కరి కరునా నర దేహీ । దేత ఈస బిను హేతు సనేహీ ॥
(మానస. ఉత్తర. 44/3)

జీవుడు మానవ శరీరములో వచ్చి తనని, ఇతరులను కూడా ఉద్ధరించగలడు. అతడు అందరికీ సేవచేయగలడు. ఇంకా భగవంతునికి కూడా సేవచేయగలడు. కాని తన భోగేచ్ఛకు వశీభూతుడై దుర్లభమైన అవకాశాన్ని అందకుండా చేయడం, వాడిని మనుష్య శరీరంలోనికి రాకుండా చేయడం, వానిని జన్మ ఎత్తకుండా చేయడం, పుట్టుకముందే వానిని హత్యచేయడం ఎంతటి మహాపాపం! ఆ జీవుని యెడల అది

ఎంతటి ఘోర అన్యాయం?

అలాంటి మహాపాపాలు చేసేవారికి ఘోర నరకంతోపాటు, నీచయోనులలో భయంకరమైన యాతనలు గూడ అనుభవించాల్సి వస్తుంది. వాళ్ళకి ఎప్పుడైనా మానవ జన్మ అంటూ లభిస్తే ఆ జన్మలో వాళ్ళకి సంతానయోగం ఉండదు. సంతానం లేకుండా వాళ్ళు రోదిస్తూ ఉంటారు.

సందేహము:- గర్భపాతంవలన రాగల జన్మలలో సంతానం కలగనిచో అది వాంఛనీయమేగదా! అంటే జనసంఖ్య పెరగదుగదా! అలాంటప్పుడు సంతానం లేకపోవడంవలన నష్టమేమిటి?

సమాధానము:- సంతానసౌఖ్యంనుండి దూరమయిన వారి పరిస్థితుల అనుభవం సంతానం కలగని వాళ్ళకే తెలుస్తుంది. మనుష్యులలో పుత్రైషణ, విత్తైషణ, లోకైషణ అనేవి ఈషణత్రయాలు (కోరికలు) ఉంటాయని అంగీకరించబడింది. సంతానం లేనివారు సంతానంకోసం ప్రతిచోటకి తిరుగుతారు. డాక్టరు దగ్గరకు వెళతారు. సాధువులైన సత్పురుషులదగ్గరికి వెళతారు. తీర్థయాత్రలు చేస్తారు. ఔషధములు వేసుకొంటారు. జపతపాదులు జరుపుకొంటారు. దేవీ దేవతల్ని పూజిస్తారు. దైవానికి ప్రార్థనలు చేస్తారు.

దిలీప మహారాజుకు సంతానం కలుగలేదు. అప్పుడు రాజుగారు, రాణీగారు ఇరువురూ వసిష్ఠమహర్షియొక్క గోవును రేయింబవళ్ళు హృదయపూర్వకంగా సేవించారు. గోవు వరంవలన వారికి పుత్రుడుదయించాడు. పుత్రుడైన (రఘుమహారాజు) వలన "రఘువంశం" వర్ధిల్లింది. దశరథమహారాజు సంతానం లేకపోవడం వలన దుఃఖితుడయ్యాడు. సంతానంకోసం ఆయన పుత్రకామేష్టి యజ్ఞాన్ని కూడా నిర్వర్తింపజేశాడు.

కారణమేమిటంటే నా వంశవృద్ధి ఎలా జరుగుతుంది? సాధనసంపత్తి, భూములకు, ఆస్తులకు యజమాని ఎవరవుతాడు? మనం

జబ్బుపడినా, ముసలి వారమైపోయినా మనకు సేవలు ఎవరు చేస్తారు? మనం మరణించిన తరువాత పిండప్రదానాలు, పితృతర్పణాలు ఎవరు చేస్తారు? మొదలైనవాటి విషయంలో సంతానం లేకపోవడం వల్ల తండ్రి చింతాగ్రస్తుడౌతాడు. పిల్లల్ని చూసినపుడు, తినిపించినపుడు, ఆడించినపుడు చాలసంతోషం కలుగుతోంది.

ఇళ్ళల్లో మనం చూస్తూనే ఉంటాం! ఇంటిలో భర్త అన్నభార్యకు సంతానం లేకుండా వుండి మరిది భార్యకు పిల్లలు కలిగి, ఆమె కోడళ్ళను చూసినపుడు భర్త అన్నభార్యకు నేను పెద్దదాన్ని అయినా నాకు సంతానం కలుగలేదు. నాకే బిడ్డకలిగి ఉంటే వివాహం చేసేదాన్ని కోడల్ని ఇంటికి తీసుకోచ్చేదాన్ని. ఆమె నాకు సేవలు చేసేది గదా! అని మనస్సులో చాలా బాధ పడుతుంది. కొడుకు సంతానం మనమడిమీద కొడుకుకంటే ఎక్కువ ప్రేమ కలుగుతుంది. ఒక లోకోక్తికూడా ఉంది. అసలుకంటే వడ్డీమీదే ప్రేమ ఎక్కువ కలుగుతుందని. ఈ ప్రకారంగా సంతానం ఉండటం వలన కలిగే సుఖం, గర్భపాతం చేసుకొన్నవాళ్ళు జన్మజన్మాంతరాలవరకూ చూడలేరు. ఎందుకంటే గర్భపాతం చేసుకొన్న వాళ్ళకి రాబోయే మనుష్య జన్మలో సంతానం కలుగదు.

ఎవరైనా ఒకవస్తువును దురుపయోగం చేస్తే ఆ వస్తువు తిరిగి లభించదు. ఇది సిద్ధాంతం. తల్లి పిల్లవాడికి మిఠాయినిస్తుంది. వాడు దానిని తినకుండా కాలువలో పారేశాడనుకోండి! అప్పుడు తల్లి వాడికి మిఠాయి తిరిగి ఇవ్వకుండా ఒక చెంపదెబ్బ ఇస్తుంది. అలాగే పరమాత్ముడు కరుణించి మనుష్యశరీరాన్ని ఇచ్చినప్పుడు మనిషి ఆ శరీరాన్ని దురుపయోగం చేస్తున్నాడు. పాపంచేస్తున్నాడు అలాంటప్పుడు పరమాత్ముడు వానికి తిరిగి మనుష్య శరీరం ఇవ్వకుండా పరలోకాల్లో, నీచయోనుల్లో పడేస్తాడు. పిల్లవాడు ఏమీ తెలియనివాడు కావడంవలన తల్లి వానికి మళ్ళీ మిఠాయినిస్తుంది. కాని మనిషి అన్నీ తెలిసి కావాలనే పాపం చేస్తున్నాడు. అందువల్ల అతనికి పరమాత్ముడు మళ్ళీ మానవజన్మను ఇవ్వడు. ఈ విధముగానే అన్నాన్ని, నీళ్ళనూ నష్టపరిచినవాడు ఆకలి దప్పులకు సంబంధించిన కష్టాలను భరించవలసి వస్తుంది. మంచి నౌకరుని

(పనివాడిని) తిరస్కరించే యజమానికి తిరిగి మంచి పనివాడు లభించడు. అలాగే మంచి యజమానిని తిరస్కరించే పనివాడికి మంచి యజమాని మళ్ళీలభించడు. సంత్ మహాపురుషుని తిరస్కరించేవాడికి సాధుసాంగత్యం లభించదు. ఆ విధంగానే గర్భస్థమైన జీవుణ్ణి హత్యచేసిన వాడికి మళ్ళీ మనుష్యజన్మలో సంతానం కలుగదు. ఓ పక్క సంతానాభిలాష లేకుండా కేవలమూ భోగాలను అనుభవించాడు. మరోపక్క దానివల్ల కలిగే గర్భాన్ని హతమార్చాడు. నాశనంయొక్క పరిణామం భయంకర వినాశనమే అవుతుంది. కాబట్టి భవిష్యత్తులో అనుభవించాల్సిన అనేక కష్టాలనుండి బయటపడాలంటే తెలివిగల స్త్రీపురుషులు ఎప్పుడూ గర్భపాతం వంటి మహాపాపాలు చేయకుండా ఉండాలి. ఇంకా వివరములను గీతాప్రెస్ వారు ప్రచురించిన "గర్భపాతము ఉచితమా? అనుచితమా?" అనుపుస్తకమును పఠించుడు.

~~~~oOo~~~~
~~~~

# 5. సంఘర్షణకు కారణాలు

జాతిభేదాలకారణంగానే సమాజములో వివాదాలు విద్వేషాలు కలుగుతున్నాయని నేడు ప్రచారం చెయ్యబడుతుంది. అందువల్ల జాతిభేదాలను అంగీకరించవలసిన పనిలేదు. ఇది బొత్తిగా తప్పుడు అభిప్రాయం. వాస్తవానికి సంఘర్షణ, జాతి ఆధారంగా జరగదు. అది అహంకారం నుండి పుట్టే స్వార్థం, అభిమానం ఆధారంగా జరుగుతుంది.

సృష్టిలో జాతిభేదం స్వాభావికమైనది, సహజం. అనేక దేశాల మానవుల్లో అనేక జాతులున్నాయి. కేవలం మనుషుల్లోనేకాదు పశుపక్ష్యాదుల్లో, వృక్షలతాదులలో కూడా జాతిభేదం సహజంగానే ఉంది. ఆవు, ఎద్దు, గొఱ్ఱె, మేక, గుఱ్ఱం, ఒంటె, కుక్క మొదలైన జంతువుల్లో అనేక జాతులున్నాయి. ఇంకా వాటి ఒక్కొక్క జాతిలో కూడా అనేక భేదాలున్నాయి. జాతిని వాటి గుణాలనుబట్టి గుర్తిస్తాం. వీటి క్రయవిక్రయాలు జరిపేవాళ్ళకి వీటి జాతి సంబంధమైన బాగోగులు పరిచితమవుతాయి. జాతినిబట్టి వీటి ఖరీదు నిర్ణయింపబడుతుంది. అలాగే వృక్షాలలో కూడా, ఒక్కొక్క వృక్షానికి అనేక జాతులుంటాయి. ఫలాలలో, ఇంకా కాయగూరలు, ఆహార ధాన్యాలలో కూడా అనేక జాతులుంటాయి. ఈ సృష్టి వైవిధ్యంతో కూడుకొన్నది. ఈ సృష్టిలో ఒకేరకంగా సమంగా కనబడే రెండు వస్తువులు కూడా వాస్తవానికి సమంగా ఉండవు. అందువల్ల వైరుధ్యానికి కారణం జాతికాదు, అసుర సంపదయైన స్వార్థం, అహంకారం ఆధారంగానే వైరుధ్యం పుట్టుకొస్తుంది.

బ్రాహ్మణుల, క్షత్రియుల, వైశ్యుల, శూద్రుల మధ్య పరస్పరం దెబ్బలాటలుగాని, వైరంగాని ఉండదు. బ్రాహ్మణులకు బ్రాహ్మణులతో, క్షత్రియులకు క్షత్రియులతో, వైశ్యులకు వైశ్యులతో, శూద్రులకు శూద్రులతో వైరం ఉంటుంది. భావం ఏమిటంటే ఒకే బ్రతుకుతెరువు ఎక్కడైతే ఉంటుందో అక్కడ స్వార్థం కారణంగా పోట్లాట ఉంటుంది. అన్ని పనుల్లో అందరి అధికారాన్ని ఒప్పుకొన్నట్లయితే దీని కారణంగా వైరుధ్యం ఇంకా

బాగా పెరిగిపోతుంది. కారణం ఏమిటంటే అలా ఒప్పుకోవడంచేత ఏ జీవనోపాధివల్ల అధికంగా రాబడి పరువుప్రతిష్ఠలు మొదలైనవి లభిస్తాయో దానిని అందరూ చేయడం మొదలుపెడతారు. కాని ఏ జీవనోపాధివల్ల ఆదాయము, పరువుప్రతిష్ఠలు తక్కువగా ఉంటాయో దానిని మాత్రం ఎవరూ చెయ్యరు. గౌరవనీయమైన పనులు అందరూ చేస్తామంటారు. శ్రేష్ఠమయినవి కాని పనులు ఎవరూ చెయ్యాలనుకోరు. ఎలాగంటే పూర్వం రాజ్యంకోసం రాజపుత్రులే దెబ్బలాడుతుండేవారు. మరి ఇప్పుడు రాజ్యంకోసం అందరూ దెబ్బలాడుతున్నారు. పూర్వం చాతుర్వర్ణాలవారు తమతమ పనులు చేస్తూండేవారు. కాని ఇప్పుడు నాలుగు వర్ణాలవారి పనుల్లో అందరికీ అధికారం కలగటంతో సంఘర్షణ కూడా సుమారుగా పదహారు రెట్లు పెరిగి తీరుతుంది. పూర్వం ప్రజలు తమతమ వర్ణాశ్రమ ధర్మాలలో కట్టుబాట్లతో ఉండి సుఖశాంతులతో వర్ధిల్లుతూ ఉండేవారు. కానినేడు వర్ణాశ్రమ సంప్రదాయాలను తుడిచిపెట్టి అధికారం కోసం పోట్లాడుకొనే స్వార్థపూరితమైన అనేక రాజకీయపార్టీలు తయారవుతున్నాయి. ఇతరమతస్థుల ఓట్లకోసం హిందువులనే హిందువులు నాశం చేస్తున్నారు. తల్లి, తండ్రి, కొడుకు ఈ ముగ్గురు వేరువేరు పార్టీలకు వోటువేస్తారు. ఇంట్లో పోట్లాడుకొంటారు. అందరిలో సమైక్యత ఉండాలని ప్రచారమైతే చేస్తున్నారు గాని వాస్తవానికి వ్యక్తిగత అవాంఛనీయ ఏకత్వమే వర్థిల్లుతోంది. అంటే తల్లివేరు, తండ్రివేరు, భార్యవేరు, కొడుకువేరు, సోదరుడువేరు ఇలా అందరూ ఒక్కొక్కరుగా అయిపోతున్నారు. కారణం ఏమిటంటే వర్ణాశ్రమ ధర్మాల నిర్మాణం కట్టుబాట్లు, సంప్రదాయం, కర్తవ్యం పునాదిగా ఏర్పడింది. కాని ఈనాటి పార్టీల నిర్మాణం స్వార్థం పునాదిగా జరుగుతోంది.

స్వార్థం, అహంకారం కారణంగానే విభిన్న వర్ణాశ్రమాలకు, మతాలకు చెందిన మనుషులలో జాతిమొదలైన పక్షపాతం ఏర్పడుతుంది. దీనివల్ల వారు తమ జాతిమొదలైన వాటికి సంబంధించిన విషయాలపై సమర్థించటం ఇతర వర్ణాదివిషయాలను ఖండించటం చేస్తూంటారు.

సారాంశమేమిటంటే ఎక్కడయితే స్వార్థం, అహంకారం ఉంటాయో,

విలాసాలు సంపాందించాలనే కోరికలు ఉంటాయో అక్కడ రాక్షససంబంధమైన సంపద చేరుతుంది. ఈ సంపద చేరినచోట శాంతి ఉండదు. పైగా అశాంతి యేర్పడుతుంది. సంఘర్షణ జరుగుతుంది. పతనావస్థకూడా సంభవిస్తుంది.

త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః ।
కామఃక్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్ ॥
(గీత. 16/21)

"కామం, క్రోధం, లోభం ఈ మూడు నరకద్వారాలు. ఆత్మ వినాశానికి కారణాలు. కాబట్టి ఈ మూడింటినీ విడిచి పెట్టాలి."